చిన్నా! ఒకే తల్లి రక్తం పంచుకు పుట్టక పోయినా
ఒక తల్లి పాలు తాగి పెరిగాం. పంతాలు పట్టుదలలు
వస్తే నువ్వెంతో నేనూ అంతే!





పద్మశ్రీ వారి

# ప్రాణమిత్రులు

నిర్మాత.. వి. వెంకటేశ్వర్లు · దర్శకత్వం.. పి. పుల్లయ్య

కథ మాటలు.. ముళ్లపూడి వెంకటరమణ
సంగీతం.. కె.వి. మహదేవన్ - ఫొటోగ్రఫీ.. సెల్వరాజ్
ఆర్టు.. ఎస్. కృష్ణారావు · సూరన్న · కూర్పు.. ఎన్. ఎం. శంకర్
స్టూడియో.. శ్రీ సారధి

కృషి ఫిలింస్ రిలీజ్
మైసూరు.. చిత్రశ్రీ రిలీజ్

NVKR

# ఉత్తరాలు

## క థ లు

అడివి బాపిరాజు సుబ్రహ్మణ్యంగారి "నిజం" కథ చాలా బాగుంది. కథలో సహజత్వం ఉట్టి పడుతోంది. సంభాషణలు సమయోచితంగా ఉన్నాయి. మంచి కథ రచించిన సుబ్రహ్మణ్యంగార్కి నా అభినందనలు. విహారి, శాలివాహన గార్ల కథ "మూడి కంటని దూరం" కూడా బాగుంది.

ఎస్. రామకృష్ణశాస్త్రి (కర్నూలు)

* * *

ఈ వారం (21-4-67) పత్రికలో ఎంకిగాడు పట్నం చూసిండు కథ చదివినంక పల్లెల్లో ఉండేటోల్లు సిటీ ఎర్రిబాగులోల్లని తెలిసింది. శాన మంచిగ రాసినారు. నా మనసుకు బాగా అత్తుకున్నది. ఇగ ఎన్నటికీ మరిచిపోను. వారు నరహరి రావుగారు బాస శాన బాగ రాసినారు. ఆరికి నా దండాలు.

కె. లలితాకుమారి (హైదరాబాద్)

* * *

నమస్తే! మీరు ప్రచురించిన "భ్రమ" కథ చాలా బాగుంది. ప్రస్తుతము అనేక జీవితములలో జరిగే సంఘటనవలె యున్నది. ముగింపు విధానములో రచయిత క్రొత్త పోకడలతో ముగించినారు. రచయిత శ్రీ జొన్నలగడ్డ వెంకటేశ్వర్లుగారికి అభినందనములు

పోలిశెట్టి అప్పారావు (విశాఖపట్నం)

* * *

28-4-67 ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'పిది నిజం' కథ ఎంతో బాగున్నది. రచయితకు ఎదురైన ప్రశ్న పాఠకుల్లోనూ ఉదయిస్తుంది. 'భ్రమ' కథ మరీ బాగున్నది. ఈ సంచికలో కథలన్నీ మాచేత ప్రశంసలు పొందినవే. రచయితలకు మా అభినందనాలు తెలపండి.

శ్రీమతి వి. కళ్యాణభారతి (కలకత్తా)

* * *

అరుణోదయం పెద్దకథ బాగున్నది. ముగింపులో కథకు రసపుష్టి చేకూరింది. కథారచయితకు, మీకు కృతజ్ఞతలు.

శ్రీమతి యల్. రాజరాజేశ్వరి (కోమటిగుంట)

* *

మూడికందని దూరంలో జ్యోతి పాత్రమెంతో చక్కగా పోషించారు. కథ చివరలో చదివేవాళ్ళ సందర్భ బాధిస్తుంది. జ్యోతి మీద జాలిని కలిగిస్తుంది. రచయితలు విహారి, శాలివాహనగార్లకు నా అభినందనలు.

వి. ఆంధ్రకుమారి (బొగల్లు)

* * *

శ్రీ తాడిసిరి సీతరామగారి మట్టిబొమ్మలు సీరియల్ చాలాబాగుంది రచయితకు నా అభినందనలు.

కుమారి అనంతలక్ష్మి (చిక్కవోలు)

శ్రీ సవగరం పార్థసారథిగారి "కుక్కగొడుగులు" చాలా బాగుంది. సమాజములోని వ్యక్తిత్వానికి "కుక్కగొడుగులు" ప్రతిబింబమువంటిది. కథ చదివిన తర్వాత నా మనస్సు ఆత్మవిమర్శకు దోహదమిచ్చి నేను కూడా ఒక్క కుక్కగొడుగునేమో అన్న భావన కల్గించింది.

శంకరరావు (బెంగుళూరు)

* * *

7-4-67 పత్రికలో వేసిన "పావులు పంతెం వచ్చెను" చాలా బాగున్నది. రాంబాబు తల్లి తన కొడుకు ప్రవర్తనను మార్పునకై ఆసక్తితో ఆ అమ్మాయి అందము చూచి—ముగ్ధురాలై—తోట ఆడదైన కూడా అసహ్యించుకుంటున్నప్పుడు వ్రాసిన విధము చాలా బాగున్నది. కథను ఊహించరాని మలుపులతో సుఖాంతము చేసిన పోలాప్రగడ సత్యనారాయణమూర్తిగారికి నా కృతజ్ఞతాభినందనములు.

పమ్మిడి విజయ (పీలేరు)

* * *

14-4-67 తేది ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురించిన 'పిరికిగాడు' కథ చాలా రమ్యంగా యుంది. కథ రచియించిన శ్రీమతి సరోజినిగారికి నా అభినందనలు.

డి. జ్యోతి (హైదరాబాద్-23.)

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో మీరు ప్రచురించిన "అరుణోదయం" కథ చాలా బాగుంది. రచన మృదువుగ, మధురముగ నున్నది. ప్రస్తుతము నా ప్రాణ స్నేహితుని జీవితంలో సంభోగ్య పాఠకులకు అందజేసినటువంటి మీకు, కథ వ్రాసినటువంటి రచయితలగు వి. యస్. నారాయణగారికి నా అశేష కృతజ్ఞత తెలుపుతూ యున్నాను.

యస్. ఆనందరావు (టాటానగర్)

## సీరియల్

"పూర్వా సంధ్యా ప్రవర్తతే" అని సీరియల్ పేరు చూడగానే "ఇది ఏమి సీరియలో" అని అనుకొన్నాము. కాని చదివిన తరువాత "ఇది ఎంతో బాగుంది" అని అనుకున్నాము. అందులో ముఖ్యంగా పరీక్షహాల్లోని విద్యార్థుల (విద్యార్థినుల) యొక్క భావాలు బాగా రాసినారు. టీచర్సు ట్రైనింగు చదువుతున్న తేజోవతిగారు పిల్లల ముఖం చూచి వారి భావాలను బాగా అర్థం చేసికోగలగటం చూస్తే వారు టీచరు అయిన తరువాత పిల్లలకు బాగా విద్య చెప్పగలరని అనిపిస్తున్నది. శంకరం మాష్టరుగారు అంత "స్ట్రిక్టు"గా వుండటం చూస్తే వారి మీద చాల గౌరవం కలుగుతున్నది. "మట్టి బొమ్మలు" సీరియల్ కూడా బాగానే ఉన్నది. "భ్రమ" అనే కథానికలోని ప్రకాశం లాటివారు ఎన్నటికి మారుతారో అర్థం కాకుండా వున్నది.

యం. వి. దేవికారాణి (గుంటూరు)

* * *

21-4-67 పత్రికలో శ్రీ కృష్ణగారి లోకసభ క్రొత్త స్పీకర్ సంజీవరెడ్డిగారు 'జీరో

ఎంతటి వారినైనా విడదీసే శక్తి కాలానికి ఉంది. అయితే, మమతానుబంధాలను, ప్రేమానురాగాలను కాలం విడదియ్యగలదా? వేరుచెయ్యగలదా??




యస్.వి.ఆర్. ఫిలిమ్స్

# చదరంగం

దర్శకత్వం యస్.వి. రంగారావు B.Sc.,

అసోసియేట్ డైరెక్టర్: కె.వి. నందన్ రావు కథ-మాటలు: డి.వి. నరసరాజు B.A.

పాటలు: దాశరధి సంగీతం: టి.వి. రాజు కెమెరా: చంద్రశేఖర్

నిర్మాత: బడేటి సత్యనారాయణ నిర్వహణ: పుట్టా వెంకట్రావు

పూర్ణా రిలీజ్

NAVARANG

# ఉత్తరాలు

అనేక మంది త్యాగం చేసి ప్రతిపక్షాల వారి అభిమానాన్ని చూరగొన్నారని వ్రాస్తూ, "తను కిచ్చిన పార్లమెంటులో శ్రీ రెడ్డి తన పాత్రను చక్కగా నిర్వహించి, దేశానికి సేవచేశారు. రెడ్డి వీరుల కోవకు చెందిన వారు కాబట్టి అధికారంగాని ఏ స్థానాలైనా వారు తగిన వారు" అని వ్రాయటం, ప్రత్యేకించి కోవలను సమర్థించటం శోచనీయం. ఈ విషయాన్ని శ్రీ కృష్ణగారు గమనిస్తారని అనుకున్నాను.

పాటుమర్తి శంకర్ (అమృతసర్)

* * *

ఈవారము మీరు ప్రచురించిన సీరియల్ "పూర్వ సంధ్యా ప్రవర్తతే" చాలా చక్కగా ఉన్నది. ఇలాంటి కథలు (సీరియల్స్) ప్రచురిస్తున్న మీకు నా ధన్యవాదములు. రచయిత్రిగారికి నా అభినందనలు. ముందుముందు ఇటువంటి చక్కని సీరియల్స్ మీ (మా) పత్రిక ద్వారా మా లాంటి పాఠకులకు అందజేయగలరని ఆశిస్తాను.

"మట్టి బొమ్మలు" సీరియల్ కూడ చాల బాగుంది. కాని మీరు తక్కువ పేజీలు వేస్తున్నారు. నాకు మాత్రము తక్కువ పేజీలు వేస్తే ఆలస్యముగా ముగుస్తుందని, త్వరత్వరగా ఎక్కువ పేజీలు వేస్తే తొందరగా సీరియల్ ముగుస్తుందని భయపడుతున్నాను.

యాస్మిన్ (ఆకివీడు)

* * *

"మట్టి బొమ్మలు" సీరియల్ చాలా బాగున్నది. మాష్టారు పాత్ర బాగున్నది. మరి కొంచెము, కొంచెము ప్రచురిస్తున్నారు.

ఈ వారపు పత్రికలో సాదికందని దారం, ప్రథమ కథలు నన్ను చదువు చున్నంతసేపు పరిస్థితులు మరిపింపచేసినవి. వీటి రచయితలకు నా హృదయపూర్వక అభినందనలు.

బొమ్మారి సుగుణ. యస్. (తెనాలి)

## ఉగాది సంచిక

ఈవారము (14–4–67) పత్రిక ఉగాది ప్రత్యేక సంచిక వెలువడి చక్కని కథానికలను అందించినందుకు సంపాదకులుగారికి కృతజ్ఞతలు.

బహుమతిని పొందిన "మట్టి బొమ్మలు" శ్రీ తాడిగిరి పోతరాజుగారు గ్రామజీవనమును వాస్తవికముగా రాసినారు. ముందు ముందు ఎలాయుంటుందో అన్న కుతూహలముగా యున్నది.

ప్రబోధకథయును, పోటీనాటి కథలు కూడ చాల బాగున్నవి.

ఎస్. ఎస్. రెడ్డి, (హైదరాబాద్)

## సినిమా బాలట్

మన ఉగాది ఆంధ్రసచిత్ర వారపత్రికలో సినిమా బాలట్ 1966 ఫలితాలు చూచిన తరువాత నాకు చాలా ఆశ్చర్యమేసింది. ఈసారి కూడ శ్రీ రామారావు ఉత్తమనటుడుగా రావడానికి కారణాలు తెలియలేదు. "నవరాత్రి", "మనసేమందిరం" వంటి ఉత్తమచిత్రాలలో అతి- ఉత్తమముగా నటించిన శ్రీ అక్కినేని రాకపోవడం చాలా శోచనీయం.

సుండూరు కొండయ్య (అనంతపురం)

* * *

మీ బ్యాలెట్ ఫలితాలు చాలా అన్యాయముగా ఉన్నవి. ముఖ్యముగా రామారావు గారిని, ఏ చిత్రమును బట్టి ఉత్తమనటునిగా ఎన్నికచేశారు? పోయినసంవత్సరములో విడుదలైన రామారావు గారి చిత్రాలలో దేనిలోను ఆయన ప్రేక్షకులకు హృదయములో హత్తుకొనేటట్లు నటించలేదు.

"నవరాత్రి" "మనసేమందిరం"లో అద్భుతముగా నటించిన అక్కినేని, రామారావు గారికి రెండవవాడుగా రావడము శోచనీయము.

సర్వసిద్ధి చిరంజీవి (విశాఖ)

## వనితాలోకం

24–3–67 సంచిక వనితాలోకం శీర్షికలోని గాలి విజయలక్ష్మిగారి "నాకు తెలిసిన అమెరికా" వ్యాసం, ఆంధ్రులు ఎంత వెనుకబడి ఉన్నారో సూచిస్తుంది. 'ఒక టైప్‌రైటర్‌లాంటి మెషిన్ వుంటుంది. ఆ మెషిన్ నొక్కుతుంటే అదే లెక్క చేస్తుంది' అని వుంది. అంటే, ఆంధ్రులకు 'కంప్యూటర్' అంటే అర్థంకాదని వారు అలా టైప్‌రైటర్‌తో వర్ణించారో, ఏమో?

జి. జయలక్ష్మి (ఒంగోలు)

## చిత్రాలు

పత్రికలోని గంగాధర్‌గారి చిత్రాలు బాగానే ఉంటున్నాయి. అయితే 7—4—67 పత్రికలో గొల్లపూడి రాజ్యలక్ష్మిగారి రాజేశ్వరి కథానికకు వేసిన చిత్రంలో రాధా చిత్రానికి మీసాలు కొంచెకటీలో చిన్నవిగావేస్తే, కథానిక వర్ణనలోమాత్రం ఒకచోట "ఇంతింతపెద్ద మీసాలు ఎవర్ని భయపెట్టడానికి" అని రచయిత్రి వర్ణించారు. చిత్రకారుడు కథానికలోని వర్ణనను దృష్టిలో పెట్టుకుని యింకా చక్కటి బొమ్మలు వేస్తారని భావిస్తాను. 'అరటికాయతో ఆరురకాలు' లాంటివంటకాల శీర్షికను వరుసగా ప్రచురిస్తే బాగుంటుందని నా సలహా. ఎస్. ఎస్. మణ్యమ్‌గారిచిన్నకథ 'ఆరనిసెగ' ఎంతో ఆకర్షించింది నన్ను. రాజశేఖరం తండ్రిపాత్ర విచిత్రంగా కన్పించినా ఇక్కడక్కడా అరుదుగా అటువంటి వ్యక్తులు ఉంటారేమో! "మొదుడికిమేత" యింకా కొంతకాలం సాగిస్తే సరదాగా ఉంటుంది.

యస్. సుగుణ (విశాఖపట్నం)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 19—5—'67
ప్లవంగనామ సం॥ వైశాఖమాసం శుద్ధ నవమి

సంపుటము : 59 సంచిక : 36

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |




## విషయానుక్రమణిక














# భారతీయులు - భాషా సమస్య

జాతీయ భిన్నత్వాన్ని రేకెత్తే మరో సంఘటన ఇటీవల జరిగింది. కేంద్ర విద్యామంత్రి శ్రీ టి. సేన్‌గారు ఒక కుంభమేళాను ఏర్పరిచారు. అందులో మొదటి రెండురోజులూ పార్లమెంటు సభ్యులు పాల్గొన్నారు. తర్వాత మరో రెండురోజులు వివిధ రాష్ట్రాల విద్యామంత్రులు పాల్గొన్నారు. మన కేంద్ర విద్యామంత్రిగారు విద్యావేత్తల్లో అగ్రశేణికి చెందినవారు. త్రిభాషా విధానం చిన్నపిల్లల వంటికి మంచిదికాదని, చిట్కా సరయినది కాదని, ఎదిగే పిల్లలకు ఇలాంటి వైద్యం అసలు పనికే రాదని ఆయన వాదం. ఇక అందరెరిగిన విద్యావేత్త శ్రీమతి ఇందిరాగాంధీగారున్నారు. వారు విద్యామంత్రిగారితో ఏకీభవించలేదు. ఒక పిల్ల, లేకపోతే పిల్లవాడు మూడు భాషలకంటె ఎక్కువగానే నేర్వగలిగిన శక్తివంతులై వుంటారు. అంచేత ఈ త్రిభాషా విధానాన్ని అనుసరించడం వారికో లెక్కా? అన్నారు.

పార్లమెంటు సభ్యులు గుమిగూడినప్పుడు కొన్ని అంగీకారాలు కుదిరాయి. అది, ప్రాంతీయ భాషల్లో విద్యాబోధన జరగాలి అనేది... మాతృభాషను, తదితర భాషల్ని కలిపే భాష సంగతి మరచిపోయి ఆ తర్వాత నాలిక్కరుచుకున్నారు. ఇది మొదటి రోజు సంగతి. మర్నాడు, అంతక్రితంరోజు అంగీకారం కుదిరిన విషయాన్ని మరచిపోయారు. పిల్లల భవిష్యద్దృష్ట్యా ఆలోచించారు. ఇంగ్లీషుగాని, హిందీగాని ఒక పిల్లవాడు హాయ్యర్ సెకండరీ పాఠశాలను విడిచిపెట్టే ముందు నాలుగు సంవత్సరాలు నేర్చుకు తీరాలని నిర్ధారణ చేశారు.

ప్రాంతీయభాష, తప్పనిసరి హిందీని గురించి యోచించి చూసినప్పుడు, అది 'హిందీ ప్రదేశాల'కు చాలా బాగుంటుంది. ఈ హిందీ ప్రదేశాల తెగలో ఇప్పుడు గుజరాత్ కూడా కలిసింది. బీహార్, ఉత్తర ప్రదేశ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, హర్యానా- ఇవన్నీ హిందీ నిండిన రాష్ట్రాలు. వీరందరూ ఒకే భాషను నేర్చుకుంటారన్నమాట. అరవం, తెలుగు, మలయాళం, అస్సామీ, బెంగాలీ, కన్నడం వారంతా రెండు భాషలు నేర్చుకోవాలి. ఆఁ... అన్నట్టు, మన శ్రీమతి గాంధీ మాతృప్రదేశంలో వారంతా నేర్చుకొనేది ఒకేఒక భాష. అది హిందీ! 'నువ్వు తోకలు పోగొట్టుకుంటే నేను తలకాయలు రాబట్టుకుంటాన'నే సామెతన్నమాట!

రాష్ట్రవిద్యామంత్రులసభలో బీహార్ ఒక సమస్యగా తయారయింది. మధ్యలో ఉప ప్రధాని శ్రీ మొరార్జీదేశాయ్ కలిగించుకుని, భారతదేశాన్ని బహుభాషారాష్ట్రంగా తయారుచేయకుండా హిందీని అధికార భాషగా అంగీకరించండి, అంటూ అందర్నీ ప్రాధేయపడ్డారు. అలా అన్నప్పుడు మద్రాసు ప్రభావం ఎలావుంటుందో మనందరికీ తెలిసిందే. ఆంధ్రప్రదేశ్, మైసూరు మాత్రం అటూ యిటూ కాకుండా మాటాడక వూరుకున్నాయి. మాకు ఇంగ్లీషే కావాలి అని అస్సాం గట్టిగా అంది. కేరళ అభిప్రాయమేమిటో ఎవరికీ తెలియదు. దక్షిణాదివారి పిల్లలకు భాషాసమస్య ఆహారానికంటె ముఖ్యమైంది. అలాంటప్పుడు, దక్షిణాది వారంతా 'మేము విడివిడిగా నుంచున్నాం, కలిసివడిపోతాం' అనే పారంపర్యవిధానాన్ని 'పాటించడం అంత సులువుగా కనిపించదు! వీరిపద్ధతి ఇలావుండగా, ఉత్తరాదివారంతా కలిసికట్టుగా తీర్మానాలుచేసుకున్నారు. ప్రతి హిందీయేతర ప్రజమీద హిందీని రుద్దడానికి వారంతా కంకణం కట్టుకున్నారు.

రాష్ట్రమంత్రులంతా కలిసి ఒక అభిప్రాయంలో మాత్రం పూర్తిగా ఏకీభవించారు. అది, ప్రాథమికదశనుండి పోస్టుగ్రాడ్యుయేషను వరకు విద్యాబోధన ప్రాంతీయ భాషలో జరగాలి, అనేది. అధికారభాష గురించిగాని, ఇతర ప్రముఖభాష గురించిగాని అసలు మాటలే కుదరలేదు. కాని, కేంద్ర విద్యామంత్రిగారు మరో ప్రముఖభాష అన్నా అనుబంధ భాష అన్నా హిందీయే సుమా అని అందరికి జ్ఞాపకంచేశారు!

ఈ ప్రాంతీయభాషావాదం పూర్తిగా ఉత్తరాదివారి స్వార్థం! దక్షిణాదివారికి తీరని అన్యాయం! అందుకు బోలెడన్ని కారణాలున్నాయి. బీహార్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్ మధ్యప్రదేశ్, రాజస్థాన్, హర్యానా—వీరి ప్రాంతీయభాష హిందీ. అందరూ ఏకీభవించిచేసే తీర్మానంవల్ల వీరికోరిక సఫలమవుతుంది. గుజరాత్‌ను తీసుకుంటే, అది ఇప్పటికే హిందీరాష్ట్రమైపోయింది. మరాఠీ లిపి హిందీకి చాలాదగ్గర. బెంగాలీబాబులు వారి లిపిని వారు బాగా ప్రేమిస్తారు, ఆ భాష కూడా హిందీ చుట్టమే. అస్సామ్‌కు ఇంగ్లీషు కావాలి. అందుకు కారణం వారికి ఇంగ్లీషుమీద అమితమైన ప్రేమ ఉందని కాదు. అసలు వారికి హిందీరాదు, అస్సామీ అంతకంటే తెలియదు! ఈ రెండు భాషలు నేర్చుకునేదానికంటే ఇంగ్లీషు సులువని వారి ఉద్దేశం.

ఆంధ్ర, కేరళ, తమిళ, కన్నడ దేశాల్లో వారి భాషలకు అత్యున్నత స్థానం వుంది. ఆయా భాషలకు అంతకుమించిన సంస్కృతి ఉంది. వీరు వాటిని ఎలా 'వదులుకో'గల్గుతారు? మైసూరు సమీపంలో ఉన్న కొంకిణి భాష మాట్లాడే వారితో మహారాష్ట్రులకు కొంత చిక్కు వచ్చే మాట నిజం. నాగా, మిజో, పంజాబు రాష్ట్రాలు విడిగా నిలబడతాయి. కాశ్మీర్ అభిప్రాయమేమిటో ఇంతవరకు ఎవరికీ తెలియదు. ఒకటి రెండు అటూ యిటూగా ఉత్తరాది ప్రాంతమంతా దక్షిణాదిని పూర్తిగా విసర్జించడానికి చూస్తున్నది. దక్షిణాదివారు వేరు కావడానికి చూస్తున్నారు. దక్షిణాది కాంగ్రెసు వ్యక్తులు గనక వారి భవిష్యత్స్థానం జన్మహక్కును అమ్మజూపితే ఈ వి

[illegible]న తప్పకుండా జరుగుతుంది!

భాషను ప్రాంతీయం చేయడంలోని ముఖ్యోద్దేశం, ఆయా రాష్ట్రాలలో నుంచి తత్ భాషేతరుల్ని పారతోలడమే! బొంబాయిలో 'శివసేన' కంటున్న కలలు నిజమవుతాయి. మహారాష్ట్రులు కాని వారందరు ఆ రాష్ట్రం నుంచి వైదొలగడంతో మహారాష్ట్రుల జన్మ సార్థకమైపోతుంది! ఇది రెండు వైపులా పదునున్న కత్తిలాంటి ఉద్యమం. అదే విధంగా గుజరాత్‌లోని మరాఠీ మాట్లాడే పనివాళ్ళు, ఇండోర్‌లోని మరాఠీ రాజవంశాలు, గ్వాలియర్, బరోడాల్లోని మరాఠీజాతి అంతా మాతృదేశానికి తరలిపోతుంది! బొంబాయి, కలకత్తా నగరాల్లోనుంచి దక్షిణాదివారిని తరిమేస్తే, దక్షిణాదిన వేళ్ళు పాతుకుపోయిన బిర్లా, డాల్మియాల్లాంటి వాళ్ళు ఇక్కడ నుంచి బిచాణా ఎత్తేస్తారన్నమాట!

కేంద్రం పరిస్థితి ఎలావుంటుందిట? హిందీమీద కూర్చుని, ఎటూ జరగకుండా దక్షిణాదివారితో సంప్రదించడం ఎలా జరుగుతుంది? హిందీయేతరభాషలో ఎటువంటి ఫర్మానా అందినా దాన్ని నిరాకరించడం తత్వంగా పెట్టుకొన్న ఢిల్లీ మెట్రోపాలిటన్ కౌన్సిల్ తలదన్నే వ్యవహరిస్తుందా కేంద్రం? జనసంఘంవారు కల్పించిన ఈ త్రోవన కాంగ్రెసు ప్రభుత్వం అనుసరిస్తుందేమో కొంచెం వేచి చూద్దాం. రాజధానిలో హిందీయేతరవర్గం వారి భవిష్యత్తు వూహాతీతం గనక ఎలా పరిణమిస్తుందో ఎదురు చూద్దాం! బహుశా దక్షిణాదివారికి ఉద్యోగాలు యివ్వకూడదు అనే అభిప్రాయాన్ని ఏర్పరచుకోవచ్చు. లేదా రెండు భాగాలుగా చేసి ఉద్యోగాలు ఇవ్వొచ్చు. ఒక భాగంలో హిందీప్రాంతాలవారికి ఉద్యోగాలు ఇస్తారు, రెండోభాగంలో హిందీయేతర రాష్ట్రాలవారికి ఉద్యోగాలు ఇస్తారు! అలానే కేంద్ర ప్రభుత్వపాలనకూడా విభాజితమవడానికి అవకాశంవుంది. ఇది ఒక జటిల సమస్య. మనకు అడుగడుగునా చిక్కుసమస్యలే!

భారతరక్షణదళాల దగ్గర్నుంచి హిందీ శిక్షణ ప్రారంభమవుతుంది. కొంతకాలం హిందీని నేర్చుకోవడానికని సెలవులిచ్చేస్తారన్నమాట! ఇక సాంకేతిక, విజ్ఞానశాస్త్రాలన్నీ హిందీకరించబడతాయి. వాటికి సరియైన పదజాలాన్ని ప్రకాశ్‌వీర్‌శాస్త్రి అండ్ కంపెనీవారు కూరుస్తారు. అలానే భారతదేశంతో సంబంధమున్న దేశాలన్నీ వారివారి దేశాల్లో హిందీని ప్రవేశపెడతాయి. లేదా భారతదేశంతో సంబంధాలు తెగతెంపులు చేసుకుంటాయి. తర్వాత్తర్వాత హిందీ అంతర్జాతీయభాష అవడానికి కూడా అవకాశం కనిపిస్తూ వుంది! ఇదంతా కూపస్థమండూకం వైఖరి. ఒకవిధంగా చూస్తే కొత్తగా స్వతంత్రం సంపాదించుకున్న దేశాలన్నీ పాశ్చాత్యవిధానాన్ని అనుసరిస్తున్నాయి. ఆఫ్రికా అంతటిలోనూ పాశ్చాత్యప్రభావం ఉంది. తక్కిన స్వతంత్రదేశాలన్నీ అభ్యుదయపథానికి అడుగులువేస్తుంటే, మన భారతదేశం మట్టుకు వెనకడుగువేస్తున్నదనడానికి ఇవన్నీ నిదర్శనాలే. జనసంఘాన్ని ఎదిరించి ఢిల్లీలో ప్రజలు చాలవరకు ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటున్నారు. వీరూ హిందీవారే మరి! భారతదేశ ప్రజల భాషావిధానానికి ఢిల్లీ ప్రజలు మచ్చుతునకలు! శ్రీ మొరార్జీదేశాయ్ ఈ సమస్యను లోతుగా ఆలోచించినట్లు కన్పించదు. ఇంగ్లీషును పూర్తిగా అణగతొక్కితే ఆతర్వాత పశ్చాత్తాపం తప్పదు!

ఇప్పుడున్న పరిస్థితినిబట్టి చూస్తుంటే, హిందీ అనే భాష దేశానికి కంటక ప్రాయంగా తయారయింది. అంతర్జాతీయంగా భారతదేశం ఏకాంతవాసం చేస్తూ వుంది. ప్రపంచలోని వివిధ పరిశోధనలను, విస్తృత ప్రయోజనాలను నెట్టివేసి, భారతదేశం తలుపులు మూసుకు కూర్చుంటోంది!

ఈపైన భారతీయులు విదేశాలకు వెళ్ళి విద్యార్జన చేసే అవకాశాలు కుంటుపడతాయి. కళ్ళు తెరచిచూస్తే ఇంగ్లీషు ప్రాధాన్యత భారతీయులకు అవగతమవుతుంది. ముఖ్యంగా, దక్షిణాదివారు ఇంగ్లీషును తొక్కిపెట్టడం మంచిదికాదు. ఇంగ్లీషును ఆమోదించడం బిడ్డల భవిష్యత్తుకు ఎంతయినా మేలు చేస్తుంది. హిందీప్రాంతీయులు భారతదేశం నుండి పాకిస్తాన్ విడిపోవడానికి కారకులైనారు. వారు మళ్ళీ భారతదేశాన్ని విభజించడానికి వెనకాడరు. కాని, దక్షిణాది ప్రజలకు భారతదేశం మీద, భారతదేశ సంతానం మీద ఎంతో బాధ్యత ఉంది. ఆ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించడం దక్షిణాదివారి ప్రధాన కర్తవ్యం! ●

## లోకం పోకడ

—స్టాలిన్ కుమార్తె శాకాహారి అయింది. "రాయబారి (సోవియట్ రాయబారి శ్రీ ఐ. ఎ. బెనిడిక్టోవ్) ఆమెని, భారతీయుల ఈ అలవాటుని వేళాకోళం చేశాడు. ఈ పిచ్చిపని మంచి ఫ్యాషన్ చెయ్యదగింది కాదన్నాడు."

23—4—67 'టైమ్స్ ఆఫ్ ఇండియా'

* * *

గౌరవ నియుక్తైన మంత్రిగారికి (శ్రీమతి చంద్రశేఖర్) కొన్ని 'ప్రశ్నలు' వదులుగా ఉన్నాయని తెలుస్తూనే ఉంది.

23—4—67 'ఆర్గనైజర్'

* * *

—సామ్రాజ్యవాదుల ఒత్తిడి లేకుండా సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని నిర్మించే కర్తవ్యానికి మనం కట్టుబడి ఉన్నాము, 'స్వతంత్రు'డయిన అధ్యక్షుడిని ఎన్నుకుంటే అది సాధ్యం కాదు. 29—4—67 బ్లిట్జ్.

* * *

—అస్సాంలో దొరికే ఒంటికొమ్ము ఖడ్గమృగం వెల 2 లక్షల రూపాయలకి పెంపటం జరిగింది. ఈ పెరుగుదల విదేశాలకే వర్తిస్తుంది.

25—4—67 'టయిమ్స్ ఆఫ్ ఇండియా'

* * *

—ఈ ఎన్నికలలో సుబ్బారావు అసలు ప్రత్యర్థి డా. జకీర్ హుసేన్ కాదు, పైకి వస్తున్న 'సోషలిజమ్'.

29—4—67 స్వరాజ్యలో ఎ. కె. సేన్.

* * *

—ఒక సౌందర్య రాణి ఎన్నికకి ఎంతరాజకీయ ప్రాముఖ్యతవుందో భారత రాష్ట్రపతి ఎన్నికకి సాధారణంగా అంత ప్రాముఖ్యతే ఉండి. ఆమాత్రం పోటీకూడా ఉండదు.

21—4—67 'టయిమ్స్' వారపత్రిక.

* * *

—ప్రభుత్వం నడిపేపత్రికల అమ్మకం అధికం చెయ్యాలన్న ఉద్యమం ఎంత విజయవంతంగా నడిచిందో 'రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్ పేపర్' ప్రచురించిన లెక్కలే తెలుపుతాయి. కేంద్రం నుంచి 227, రాష్ట్రాల నుంచి 169 వచ్చే ఈ పత్రికల మొత్తం అమ్మకం 500,000 ప్రతులు లేదా దేశంలోని మొత్తం అమ్మకంలో 3.3 శాతం.

30—4—67 'స్టేట్స్‌మన్'










ఆరాత్రి బాండ్ఒక్కడే కూర్చుని తాళంవేసిఉన్న గదిలో గంటసేపు టయిప్ చేశాడు. ఒకేకాగితం వాడాడు.

("ఓ. కే. ఆపరేషన్ గ్రాండ్‌స్లామ్ వివరాలు....")

("న్యూయార్క్ పింకర్టన్స్‌లో పనిచేస్తున్న నా స్నేహితుడు ఫెలిక్స్‌లెయిటర్ ఎడ్రస్ రాశాను. వెధవకి ఇది చేరుకుందని ఆశించవద్దాము.......")

("దీన్నిప్పుడు గోల్డ్‌ఫింగర్ ముఠాకి దొరకని చోటా, ఎవరో ప్రజాశ్రేయోభిలాషికి దొరికేచోట పడెయ్యాలి!")










మర్నాడుపొద్దున ఫోర్ట్‌నాక్స్‌మీద.....ఎ..

"కిందవాళ్ళు మనమెవరం? ఎందుకిలా ఎగిరి వస్తున్నాం? అని అడుగుతున్నారు. ఇక్కడికి రాకూడదుట........"

"నేను పారమవుంట్ పిక్చర్స్ కార్పొరేషన్ తాలూకు గోల్డ్‌ని. అనుమతితీసుకునే వచ్చాను. థర్డ్ ఆర్మర్డ్ డివిషన్ వారిదగ్గర కాపీకూడా ఉంటుంది.."

"ఇంకోసారి చుట్టి ఇంటికి తిరిగెళ్లటమే! ఆడ్‌జాబ్ ఫలహారాలు........"

("ఇకలెయిటర్‌కి నాసందేశం పోస్ట్ చెయ్యొచ్చు కాని ఎలా? ఎక్కడ?")










బొటనవేలికింద కాలికి అంటిపెట్టుకునిఉన్న కాగితంచుట్ట తగిలిందది......

("ఇక్కడెక్కడో వదిలెయ్యాలి......ఆ!")

అయిదు నిముషాల తర్వాత....ఎ...

"ఏమి మర్కట మహాశయా! (ఈసీటుకింద పెడితే తుడిచేవాళ్ళకి దొరకచ్చు?")

"అర్.......!"

("సందేశం సీసాలో..... సీసావల్లకాట్లో! ఇంతకన్నా ఏంచెయ్యగలము!")










ఆపరేషన్ గ్రాండ్ స్లామ్ రోజువచ్చింది......
"నాఏజెంట్లు ఈప్రాజెక్టు మొదటిభాగాన్ని చక్కగా పూర్తిచేశారన్నమాట........"

"అంటే, జి. బి. విషం ఫోర్ట్‌నాక్స్ నీటిలో కలిపారా?"
"కరెక్ట్ మిస్టర్ బాండ్!"

"కార్యక్రమం వివరాలకి సంబంధించిన కాగితా లన్నిటినీ పేర్చు. రాత్రిపన్నెండు గంటలకి రయి లెక్కు-లెక్కుదాము........"










మధ్యరాత్రి, పెన్సిల్వేనియా స్టేషన్‌లో, ఆపరేషన్ గ్రాండ్ స్లామ్‌రోజు.........
"డాక్టర్ గోల్డ్‌నా? వస్తేవార్తలు అంతబాగా లేవు......"

"అన్ని రయిళ్ళనీ లూయిస్ విల్‌దగ్గర ఆపేస్తున్నారు. ఫోర్ట్‌నాక్స్‌నుంచి సమాధానం లేదు. ఏమిటి గొడవ?"
"ఆదేదోమత్తుజబ్బు. బహుశ ట్రయిపెనో సోమియాసిస్ అయివుండవచ్చు!"

"అలాగా? మీడాక్టర్లనీ, నర్సులనీ రయిలెక్కించండి. బండితీసుకుపోతాను!"










పుస్సీగెలోర్ 'సిమెంట్‌మిక్సర్' ముఠా సభ్యురాళ్ళందరి నర్సుల వేషంలుచూసి బాండ్ వంకరంగా నవ్వుకున్నాడు.
"హాయ్! అందగాడా, ఏమిటసలే కనిపించటం లేదు......"
"హలోపుస్సీ! నీకావేషం బాగా నప్పింది......!"

"నువ్వు నిజమయిన దొంగవికావనిపిస్తోంది...... ఎందుకోగాని......"
"నాకు నీరసంగాఉంది! కాస్త నర్సింగ్‌చేస్తావా?"

"ఈవ్యవహారం బెడిసికొడితే అందగాడికే కారణాలు తెలిసిఉండాలిఅని పందెంకాస్తాను.....అర్థమవుతుందా?"

(ఇంకా వుంది)



# నా విదేశయాత్ర

## జమునారమణారావు



(గత సంచిక తరువాయి)

మేము నలుగురం ఆ గాజు తొట్టిలో కూచున్నాం. ఆ తొట్టిలోంచి పైకి చూస్తే కొండ ఎంతో ఎత్తుగా కనిపించింది. రెండు వేల అడుగుల ఎత్తునవుండే ఆ శిఖరంపైన 160 అడుగుల ఎత్తుగల 'మేరిమాత' పాలరాతి శిల్పంవుంది. మేం కూచున్న పెట్టె ఒక్కకుదుపుతో కదిలింది. అది కదలకముందు పైకిచూస్తే — పెట్టె వెనుక భాగానికి వంగిపోతుందేమోనన్న భావం కలుగుతుంది. కాని అది కదలగానే మామూలు రైల్లో ప్రయాణంచేస్తున్నట్టు [illegible] గావుంటుంది. కొండమీదవుండే చిన్న అడవి, దూరంగావున్న పట్నంఅంతా తమాషాగా కనిపిస్తాయి.

అయిదు నిముషాల్లో పైకివెళ్ళాం. మేరి మాతవిగ్రహం, దానిచరిత్ర తెలుసుకున్నాము. అక్కడే ఒకచర్చివుంది. దాని వయసు కొన్నివేల సంవత్సరాలట! అప్పటికే టైమ్ అయిపోవటంవల్ల పూర్తిగా [illegible] బయలుదేరాం. [illegible] [illegible]. [illegible] 21 [illegible] అక్కడవున్నాయి. [illegible] [illegible] [illegible] [illegible] [illegible]

మా కోసం మద్రాసు మిత్రుడు కాచుకునివున్నారు. ఆయన మమ్మల్ని మంచి ఇండియన్ రెస్టారెంట్‌కి తీసుకువెళ్లారు. మనవాళ్లంతా, ఆ వూళ్లో పేరుగాంచిన 'బిర్యానీ' అది తిన్నారు. నేను వెజిటబుల్ బిర్యానీ తీసుకున్నాను, ఎందుకయినా మంచిదని ఆవకాయ సీసా బ్యాగ్‌లో ఉంచుకున్నా. అది తలా కొంచెం వేసుకొని ఆ సీసా ఖాళీ చేశాం. ఇన్నిదేశాలు మాతో తిరిగి, అవసరానికి అన్నపూర్ణలా మమ్మల్ని ఆదరించిన ఆవకాయ సీసాను ఆ హోటల్‌వారికి యిచ్చివేసి — భోజనాలు ముగించుకొని బయటకు వచ్చాం.

ఆనాటి సాయంత్రం బయలుదేరే ఎయిర్ ఇండియా ప్లేన్‌లో ఇండియా వచ్చేసేందుకు నిర్ణయించుకున్నాం. మధ్యాహ్నం మూడున్నర అయినా, ఆ వాతావరణం ఎంతో చల్లగా, అందంగావుంది. మేము దిగిన హోటల్ చాలాదగ్గర. [illegible] అంతా నడుస్తూ హోటల్‌కి వచ్చాం. ఒకగంట రెస్టు తీసుకుని, తర్వాత సామాన్లు సర్దుకుని ఏడున్నరకి ఎయిర్‌పోర్ట్ చేరుకున్నాం.

మాతో మద్రాసు మిత్రుడుకూడా వస్తున్నారు. ఎయిర్‌పోర్ట్ చేరాక మా టిక్కెట్స్ ఎండార్స్ చేయించాం. ఢిల్లీలో దిగగానే, తొమ్మిదిగంటలకు మద్రాసు బయలుదేరే కారవెల్ ప్లేన్‌లో — మేము వెళ్ళే ఏర్పాటు చేయించమని అడిగాము. ఎనిమిదిగంటలకు ఢిల్లీ చేరుతామని, ఒకగంట టైమ్ వుంటుందని, మేము కేబుల్ యిస్తామని చెప్పారు. ఆ గంటా కస్టమ్స్‌లో పోయిందంటే మేము ఆరోజు మద్రాసు చేరుకోలేము. అయినా కస్టమ్స్‌లోనకూ వెంటనే ప్లేన్‌కి వెళ్ళేవారికి ముందు ప్రాధాన్యత నిస్తారు. అందువల్ల దాన్నిగురించికూడా నేను బాధపడవలసిన అవసరం లేకపోయింది.

ఇంతకీ అక్కణ్ణుంచి ప్లేన్ బయలు దేరటానికి మూడుగంటలు లేటయింది. ఇండియా చేరినా ఆనాటిమాత్రం మద్రాసు చేరలేమనిపించింది. ఆ మూడుగంటల కాలాన్ని ఎలా గడపడం? నేను, మద్రాసు మిత్రుడు సామాన్లదగ్గర కూచుంటే — గుమ్మడిగారు, మధుగారు అక్కడేవున్న మరో లాంజ్‌లోగల 'డ్యూటీ ఫ్రీ షాపు'లోకి వెళ్లారు. గంటన్నర తర్వాత తిరిగివచ్చారు. వారిద్దర్నీ అక్కడ కూచోబెట్టి — మేం యిద్దరం ఆ షాపులు చూసేందుకు వెళ్ళాం. నేను ధరల వ్యత్యాసం కనుక్కోవడానికి ప్రతివస్తువుధరను తెలుసుకుంటున్నాను. ఒక అరగంటదాకా అలా తిరిగి తిరిగి అరబ్బీడ్రెస్‌లోవుండే ఒక బొమ్మకొన్నాను. అక్కడ దొరకని సామాను అంటూలేదు. ఎన్నోరకాల ట్రాన్సిస్టర్స్, టేప్‌రికార్డర్స్, వాచీలు, సెంట్స్, టెలివిజన్‌లు, బట్టలు, నగలు, బొమ్మలు — చెప్పనలవి కానన్ని వున్నాయి. అలా చూస్తూ వెళ్తే 'అబ్బ, ఎంత బాగున్నాయ్! డబ్బుంటే అన్నీ కొనేయాలి' అనిపిస్తుంది డబ్బు వుండేవారికి,. మాలాగా టైమ్ గడపాలని వచ్చేవారికి చూస్తూ వెళ్తే చాలు! కాలం ఎలాగడిచిందో కూడా తెలీదు.

మేము మనవాళ్లను చేరుకుని కూచున్నాం. అక్కడ అటెండర్ ప్రతి పదినిమిషాలకు రావడం — నమ్రతగా మాకు ఏంకావాలో తెలుసుకోవడం, చూస్తే ఎంతమంచివార-

అనిపిస్తుంది. రాత్రి [illegible] 'బీరూట్'కి గుడ్‌బై చెప్పి—మనదేశాన్ని మనవాళ్ళను రేపు చూస్తాం అన్న సంతోషంతోను, యిన్ని రోజులుగా ఒక్కొక్క దేశంలోను పొందిన అనుభవాలను నెమరు వేసుకుంటూ ఎయిర్ యిండియా ఎక్కాము.

ఎందుకనో చాలా సేపటిదాకా నిద్ర పట్టలేదు. తిరిగి యిలాటి అవకాశం లభిస్తుందా ? మిగిలిన దేశాలుకూడా చూడ గలమా? అనిపించింది. డబ్బున్నంత మాత్రాన యిలా విదేశ పర్యటనలు అందరికీ లభ్యంకావు. ఆ అదృష్టమూ వుండాలి. టైమూ రావాలి. డబ్బువుండికూడా ఎంత మంది వెళ్ళగలుగుతున్నారు?...భగవాన్! ఎక్కడో ఒక చిన్నపల్లెటూరిలో పుట్టి పెరిగిన నాకు—యింతటి మహద్భాగ్యాన్ని కలుగజేశావు. నీ లీలలు ఎంత అద్భుతం! కళ్ళలో నీరుతిరిగింది. అలా ఆలోచిస్తూ వుండగానే ఎపుడో నిద్రముంచుకొచ్చేసింది.

ఎయిర్ హోస్టెస్ అనౌన్స్‌మెంట్‌తో దిగ్గున లేచి కూచున్నాను. ఎదురుగా వున్న కిటికీలోంచి సూర్యభగవానుడు దర్శనం యిస్తున్నాడు. చాలా తీక్షణంగా వున్నాడు. గడియారం చూస్తే అయిదున్నర అయింది. ఎయిర్ హోస్టెస్‌ను అడిగి టైమ్ సరి చేసుకున్నాం. ఇండియన్ టైమ్ ఎనిమి దయింది, మరో అరగంటలో మేము మా జన్మభూమిపై అడుగు పెట్టబోతున్నాం. సంతోషంతో మనసు పరవశించింది. ఒకవక్క గుండె దడదడలాడింది ఎందుకనో! ఒక విధమయిన ఎక్సైట్‌మెంట్!... మొహాలు కడుక్కొని తయారయి కూచున్నాం. ఆ అరగంటా ఎంతో నిదానంగా జరుగు తున్నట్లు అనిపించింది. మా మనస్సెంత వేగంగా యిరాకాలం పరుగెత్తదేం?...మా విమానం మనగడ్డపై దిగుతూండగా నేను దేవుణ్ణి మనసారా ధ్యానించుకున్నా, మమ్మల్ని క్షేమంగా మనదేశం చేర్చినందుకు.

విమానం భూమినిచేరి యింకా సరిగా ఆగకముందే—మా సంచులు భుజాలకు తగిలించుకుని సిద్ధంగా నిలుచున్నాం. విమానద్వారం తెరచుకోగానే గబగబ కిందికి దిగాం. చల్లని గాలి తెర మాకు స్వాగతం చెప్పింది. ఎదురుగానే మద్రాసువెళ్ళే విమానం తయారుగావుంది, అదృష్ట [illegible] కస్టమ్స్‌లోంచి [illegible] యివతలపడితే, మద్రాసు చేరగలం అని పించింది. కస్టమ్స్‌లోకి నడుస్తూనే ఒంగి మన భూదేవిని కళ్ళకద్దుకున్నా. మాతృ భూమిపట్ల ఎందుకింత అభిమానం అంటే అది నిర్వచించలేని అనుభూతి!

ఒక నిమిషంలో కస్టమ్స్‌లోకి వెళ్ళి పాస్‌పోర్ట్, మిగిలిన ఫార్మాలిటీస్ ముగించు కుని మా సామాన్లవద్దకు చేరాం. అవన్నీ ఒకచోట పెట్టబడ్డాయి. ఎవరికివారు కూలీలతోవెళ్ళి—మన సామాన్లు వేరుచేసి తెచ్చుకుని, కస్టమ్స్ చెక్ చేసేదగ్గర పెట్టాలి. నలుగురు అధికారులు అటు యిటు నిర్మించిన యినుపకటాంచీల మధ్య నించుని—బాక్సులు, చేతిసంచులు అన్నీ



"పెళ్ళిరోజు" ప్రారంభంనాడు జమున, సంగీతదర్శకుడు ఎం. ఎస్. శ్రీరామ్, గాయనీ గాయకులు.

తెరిపించి చూస్తూవుంటారు. మేము వాళ్ళ నతిమాలి తొందరగా మా బాక్సులు చెక్ చేయమన్నాం. మద్రాస్ వెళ్ళేప్లేన్‌కు అర గంట వ్యవధిమాత్రమే వున్నది. ఎవరి బాక్సులు, సంచులువారు చూపించాం. మేకప్ సామాను చూసి ఎందుకని అడిగారు. మేం సినిమా తారలమని, మా స్వంత వుపయో గానికి తీసుకున్నామని చెప్పాం.

కొన్ని మువాసన ద్రవ్యాలు, చిన్న ట్రాన్సిస్టర్, మేకప్ సామగ్రి, నేను కొన్న బొమ్మలు అన్నీచూసి 'దట్సాల్ రైట్' సొమ్మన్నారు. వారుకూడా మనుషులనుబట్టి నిర్ణయించుకోగలరుట—సిట్లు వ్యాపారం చేసేవాళ్ళా, కాదా? అని...ఈలోగా మావారి ట్రంక్‌కాల్ అందుకున్న నా మిత్రురాలు [illegible] ద్వారా [illegible] (చెల్లీ) అని పిలిచింది. ఆమె శ్రీ [illegible] సుముమరాలు. స్నేహితురాల్ని చూడగానే నాకు ఎంతో సంతోషం కలిగింది.

మావారు—నేను వస్తున్నానని, ఒకవేళ సహాయం ఏదేనా కావలసివుంటే అందు జెయ్యమని ట్రంక్‌కాల్‌చేసి చెప్పారుట. మాదగ్గర ఇండియన్ కరెన్సీ ఒక్క పయాసైనాకూడా లేదాయె! మాకు డ్యూటీ ఏం పడలేదని ఇప్పుడేమీ అవసరం దనీలే చెప్పాను. మా సామాన్లతో నేరే లాంజ్‌లోకి చేరాం. మద్రాసుకు టిక్కెట్స్ మార్పించుకోవడానికి వెళ్తే—సీట్స్ అన్నీ రిజర్వ్ అయిపోయాయని, మాకు సీట్లేదని తెలిపారు. మేము బీరూట్‌నుంచి యింటి మెసేజ్ యిప్పించామని ఎంత మొత్తుకున్నా —వాళ్ళు మా మొరవినలేదు. కనీసం రేపటికయినా యివ్వమంటే 50 మంది వెయిటింగ్‌లిస్టులో వున్నారన్నారు.

అందరం దిగాలు పడిపోయాం. మెషన్స్ హడావిడివల్ల వున్న సీట్లన్నీ మంత్రివర్గం వారే తీసుకున్నారు. పరిస్థితినిబట్టి చూస్తే నాలుగయిదు రోజులు ఢిల్లీలోనే వుండి పోవాల్సి వచ్చేట్లు కనిపించింది. మాక వాళ్లను త్వరగా చూడాలన్న ఆకాంక్ష ఒకప్రక్క; యిక్కడ ఆగిపోవలసి వచ్చి నందుకు విసుగు, బాధ, [illegible] మరో ప్రక్క ఏర్పడ్డాయి. ఆ రోజే మద్రాసు చేరుతున్నట్లు కేబుల్ యిచ్చాము. [illegible] హైదరాబాద్, అటు మద్రాసులోని మిత్రు

# రచయితృడు

## ముద్దా బొట్టి బాబు



క్షణం పట్టదు — రచయితగా—యిత్రిగా పైకి రావాలి అంటే క్షణంసేపు పట్టదు.

అయితే — ఈ పని ఎంత తేలిక అనుకుంటున్నారో, అంత కష్టమూ ఉంది వ్వండి.

అనుభవాన్నిబట్టి సామెతలు ఏర్పడ్డాయని వాడుక. కాని, ఈ సందర్భంలో సామెతల్నిబట్టి అనుభవం గడించాల్సి వచ్చేట్టుంది.

'ఒకళ్ళిద్దర్ని చంపితేగాని వైద్యుడు కాడు' అంటారు. అలాగే—ఒకటి రెండు రచనలు తిరిగివస్తేగాని రచయిత కాడు ఇంతమాత్రాన అధైర్యపడ నక్కర్లేదు ఈనాడు ప్రపంచ ఖ్యాతిపొందిన మహాపురుషుల తొలి రచనలను పత్రికలవాళ్ళు తిప్పికొట్టినట్టు వారి ఆత్మకథల్లో రాసుకున్నారు. కనుక, రచనలు తిరిగిరావటం అదో నామోషీ కాదు. కానేకాదు.

రచయితకు ధైర్యాన్నివ్వటానికి మరో సామెత కూడా వుంది : 'నాలుగు రాళ్ళు విసిరితే ఒకటేనా తగలకపోతుందా' అని. విన్నప్పుడు మనం చదువుకున్న 'రాబర్ట్ బ్రూస్—సాలీడు' కథలోలాగా, పత్రికల వాళ్ళు వేసుకునేంతవరకూ రచయిత రచనలను పంపిస్తూ ఉండడమే పని.

కాలమానాన్ని పురస్కరించుకుని, ఈ వ్యాసంగానికి అవసరమైన సరంజామా—తాజా ఐడియాలుగల ఒక పెద్ద తలకాయ, కాపీన్ని తెల్లకాగితాలు, మంచిరకం ఫౌంటెన్ కలం, దాన్ని నింపుతూ ఉండటానికి ప్రశస్తమని పేరుపొందిన ఇంకు, కవర్లు, (ఉపయోగించని) తపాలా స్టాంపులు, బుక్ పోస్టు, ప్రెస్‌మేటర్, ఎక్స్‌ప్రెస్ డెలివరీలాంటి కొన్ని రబ్బరు స్టాంపులు...

తయారుకావలసిన సరకులు: నాటికలు, పరి(గా)మా(గా)లు—నవల, నవలిక (చిన్నసైజు నవల), అలాగే కథ, కథానిక, మరీ బుల్లిది గల్పిక, స్కిట్, స్కెచ్, వ్యాసం (దీనికో అంతు లేదు), గేయం (విమర్శకు గురి అయ్యే ఒక బాపతు), కవిత—వంటివి ఎన్నో—బుర్రలోని సైత్య ప్రమాణాను నమసరించి కాగితం మీదకి దింపునది, కాగితాలు నింపునది.

పై రకాలు అవతరించటానికి సహాయకములు : స్ట్రాంగ్ కాఫీ, టీ, సిగార్, సిగరెట్, బీడీ, జర్దా, అరదా కిల్లీ మొదలయిన ఉత్తేజకములు. ద్రవ—వాయు పదార్థాలే మేలు. 'ఘన' మైతే నిద్ర ప్రమాదం.

రచనలను భరించగల పత్రికలు—రకాలు: దైనిక—వార—పక్ష—మాస—వార్షిక—బాల, బాలిక—యువక, మహిళాభ్యుదయ, కేవలం సాహిత్య, సాంస్కృతిక—శృంగార—కథా—చిత్ర, సచిత్ర, విచిత్ర—వినోద—వెండితెర పత్రికలు ఎన్నెన్నో..

ఇందులో కొన్నింటికి కవిత అంటే గుర్రు. కొన్ని ఆడవాళ్ళరచనలకే ఎక్కువ ప్రాముఖ్యమిస్తాయి. కాబట్టి ఎందుకైనా మంచిది, కొంతకాలందాకా మీ పేరుతోగాక, వాళ్ళపేరుతో రచనలు పంపిస్తూవుండండి.

రచయిత్రిగా పేరు మోగిన తరవాత, అప్పుడింక మీపేరు వెలిగ్గొట్టవచ్చు. ఇప్పుడు మీరు రచయితుడుగా బాగా రాణిస్తారు. ఇటుపైన మీ రచనలు వెల్లగా ఉన్నా—బలే వెరామణీ !—వేడివేడి

బొకెట్స్! హాట్ హాట్ కేక్స్!— చెప్పామనా? రచయి్రతుడు అనిపించుకునేటంత వరకూ గడ్డుకాలం—సంధిసమయం—కత్తిమీాది నడక—అటువంటి మహాయోగం—రాజమార్గం. . .

కథలురాస్తే వచ్చే ఆదాయం పులుసులో ముక్కలఖర్చుకి చాలీ చాలడం. కడుపునిండే వంతులేదు. కాబట్టి, మీారు రాద్దామనుకున్న కథలు నాలుగింటికి లింకు కలిపి ఒక నవలగా తయారుచేసి పారెయ్యండి. ఈనాడు నవలకున్న విలువా గిరాకీ మరి దేనికీలేదు.

కనుక, ముందుగా దీన్ని మీా అభిమాన పత్రికలో ధారావాహికంగా సీరియలైజ్ చేయించండి.

తరవాత ?

ఊఁ—చెప్పండి, తరువాత ఏంచేస్తారూ?

'పుస్తకంగా. ..'

నాకు తెలుసు మీా ఉద్దేశం, అదే—ఆ తొందరేకూడదు. కాస్త ఆగండి ...

# రచయితృడు

మీా నవలలో అక్కడా అక్కడా కాస్త తీసి, ఒక నాటకంలాంటిది—ఇటు రేడియోకీ, అటు స్టేజికీ పనికివచ్చేలా—మలచండి.

ముందుగా రేడియోలో బ్రాడ్‌కాస్టు కానివ్వండి. ఆ ప్రసారమైన తరవాతనే స్టేజిచేయించే ప్రయత్నం.

అయిందా ?

ఇంకిప్పుడూ—ఇందాకా మీరన్న పుస్తకరూపం.

'ఫలానా పత్రికలో ధారావాహికంగా ప్రచురితమై, రేడియోలో శ్రోతలను రంజింపజేసి, వేలాది ఆంధ్రప్రేక్షకుల మన్ననలు పొందిన నవల...' అనేసరికి మీాకెంత యిదో చూస్కోండి.

అంతటితో అయిపోతే..!

వేడి చల్లారకుండా ఒక సినీ డైరక్టరును పట్టాలి. మీా నవలా ప్రతిభను గురించి పరోక్షంగా నలుగురిచేత ఆయన చెవినిపడేట్టు చాటింపించాలి. ప్రత్యక్షంగా మీారు వారిని స్వయంగా దర్శనం చేసుకుని డబ్బాకొట్టాలి, అదిరేట్టు.

తపీమని మీా నవల వెండితెర ఎక్కి కూర్చోదూ?

ఇప్పటికి రచయి్రతుడుగా మీారు మహోన్నతస్థానాన్ని అంటే తారాపథాన్ని అందుకుంటారన్నమాట.

కనుక—

మీారు నవల రాయటానికి ముందు—

ఒక అభిమాన పత్రిక

ఒక రేడియోకేంద్రం

ఒక నాటకబృందం

ఒక పబ్లిషరు

ఒక సినీ—డైరెక్టరు

ఈ ఐదు హంగులూ అమర్చుకోవాలి. ఇవే కనక సిద్ధించినవాడు, రచయి్రతుడు కావటం ఎంత ?

క్షణంసేపు పట్టదు !! ●

---

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్




(క) ఆగ్రా ప్రయాణం : ఢిల్లీ నుంచి ఆగ్రావెళ్ళి, తాజమహల్ చూచి, ఢిల్లీ తిరిగి రావాలని ఒక టాక్సీ మాట్లాడేను. రానూపోనూ ప్రయాణానికి 60 రూపాయలు ఇవ్వడానికి ఒప్పుకున్నాను.

టాక్సీ సరిగ్గా సగం దూరం వెళ్ళేక, మధుర అనే ఊళ్ళో ఒక వ్యక్తి మా కారును ఆపేడు. తానుకూడా తాజమహల్ చూడాలనీ, తనని ఎక్కనిస్తే తన వంతు డబ్బు ఇచ్చేస్తాననీ అన్నాడు. నేను ఒప్పుకున్నాను. తాజమహల్ చూచి తిరుగు ప్రయాణంలో అతడు మధురలో దిగిపోయాడు. అతడు నాకు ఎంత డబ్బు ఇవ్వాలి!

నేను ప్రయాణం చేసిన దూరంలో సగం దూరమే అతడు ప్రయాణం చేశాడు. కనుక నేను రెండు వంతులు, అతడు ఒక వంతు ఇవ్వడం న్యాయమని నా ఉద్దేశం. అంటే నేను 40రూ.లు, అతడు 20 రూ.లు ఇవ్వాలికదా! మీరేమంటారో చెప్పండి.




(చ) చదువుకున్న కప్పలు: ఇక్కడ వరుసగా ఏడు గ్లాసులు బోర్లించి ఉన్నాయి. వాటిమీద మూడు తెల్లని కప్పలు, మూడు నల్లని కప్పలు బొమ్మలో చూపినట్లుగా కూర్చు ఉన్నాయి. 1వ గ్లాసు




ఖాళీగా ఉంది. కప్ప ఖాళీగా ఉన్న పక్క గ్లాసుమీదికి గాని, ఒక కప్ప మీద నుంచి ఎగిరి తరువాత ఖాళీగా ఉన్న గ్లాసు మీదికిగాని, రెండు కప్పల మీదుగా ఎగిరి తరువాత ఖాళీగా ఉన్న గ్లాసుమీదికి గాని వెళ్ళగలదు. వెనుకకు అయినాసరే, ముందుకు అయినాసరే ఎగురగలవు. ఏ రంగు కప్పల మీదుగా అయినాసరే దాటగలవు. ఇప్పుడు చేయలసినదేమిటంటే: 1, 2, 3 గ్లాసుల మీదికి నల్లని కప్పలు, 4, 5, 6 గ్లాసుల మీదికి తెల్లని కప్పలు రావాలి. ఈ పని సాధ్యమైనన్ని తక్కువ ఎత్తులతో చేయగలగాలి. తెలివైన ఆ కప్పలు సరిగ్గా పది ఎత్తులలో ఈ పనిని సాధించాయి. మీరు మాత్రం ఎందుకు చెయ్యలేరు, ప్రయత్నించండి.

నాలుగు బంతులు:

(ట) నాలుగు టెన్నిస్ బంతులున్నాయి. అందులో ప్రతి ఒక్కటీ మిగిలిన మూడింటికీ తగులుతూ ఉండేలా అమర్చడం ఎల్లాగ?

(త) ఐదునాణేలు: అయిదు అర్ధ రూపాయలున్నాయి. వాటిలో ప్రతి ఒక్కటీ మిగిలిన నాలుగింటికీ తగులుతూ ఉండేలా అమర్చడం ఎల్లాగ?

(ప) ఆరు పెనిసిళ్ళు: ఆరు పెనిసిళ్ళు ఉన్నాయి. వాటిలో ప్రతి ఒక్కటీ మిగిలిన అయింటికీ తగులుతూ ఉండేలా అమర్చడం ఎల్లాగ?

(గ) ఏడు సిగరెట్లున్నాయి. వాటిలో ప్రతి ఒక్కటీ మిగిలిన ఆరింటికీ తగులుతూ ఉండేలా అమర్చడం ఎల్లాగ?

(జవాబులు 64వ పేజీలో

నీ పేరేవిటి అని అడుగుతున్నా!



# పెడదారి ఎంపిక

బి.పి. కరుణాకర్




ఐదైనట్లుంది. మే నెల సాయంత్రపు ఎండ కిటికీలోంచి హెడ్మాస్టరు బల్లమీదకు ఎక్కింది. గదిలో ఉక్కగా ఉంది. ప్రోగ్రెస్ కార్డులు ఇంకా పూర్తికాలేదు. ఎంతచేసినా పని తరగడం లేదు. తల నొప్పిగా ఉంది. విసుగు కలుగుతోంది. కార్డులు ఓ ప్రక్కన పెట్టి కుర్చీలో వెనక్కివాలి కూర్చున్నాను. హెడ్మాస్టరు వంక చూశాను. తల కాయి తాల్లోకి వొంచుకుని పిన్ఫోర్సు పూర్తి చేయడంలో మునిగిపోయాడు.

టేబిల్లోంచి సిగరెట్ తీసి వెలిగించాను. ఒక టీ తాగితేగాని ఈ తలనొప్పి తగ్గేట్టులేదు. మిగిలినపోయిన కార్డులు ఎప్పటికి పూర్తి అవుతాయో అర్థం కావడంలేదు. వాలీబాల్ కోర్టులోంచి కేకలు వినిపిస్తున్నాయి. కిటికీలోంచి బైటకు చూశాను. డ్రిల్లు మాస్టారు ఓ ప్రక్క కోర్టంతా తానే అయి ఆడుతున్నాడు. ఆయ నను చూసినప్పుడల్లా తెలుగు జానపద సినిమాల్లో హీరోలు గుర్తుకు వస్తుం టారు. స్కూలు ప్యూన్ దానయ్య నిలబడి ఆట చూస్తున్నాడు.

'దానయ్యా!' పిల్చాను పెద్దగా.

దానయ్య తల తిప్పి విసుగ్గా ఏమిట న్నట్టు నా వంక చూశాడు.

'ఇటురా'

దానయ్య కిటికీ దగ్గరకు వచ్చాడు.

'ఏమిటండి?'

హోటల్కు వెళ్లి ఒక టీ పట్రా' అన్నాను.

దానయ్య వెళ్ళిపోయాడు.

పెన్ అందుకుని మిగిలిన ప్రోగ్రెస్ కార్డులు దగ్గరకు లాక్కున్నాను.

నాలుగు రోజుల క్రిందట పరీక్షలు అయిపోయాయి. మొన్నటితో పేపర్లు దిద్దడం ముగిసింది. నిన్న పాస్లిస్టు హెడ్మాస్టర్ కిచ్చాను. రేపు పరీక్ష ఫలితాలు చెప్పాలి. ఈ రోజు ప్రోగ్రెస్ కార్డులు పూర్తిచేయాలి. రేపు మధ్యాహ్నం బస్ ఎక్కాలి. ఎల్లుండి ఉదయానికల్లా నాకి ఊళ్లో ఉంటాను. ఈ పల్లెటూరి జీవితం అంటే ఎందుకో విసుగు కలుగు తోంది. ఇక్కడ్నుండి ఎప్పుడు బైట పడ దామా అని అనిపిస్తోంది.

మూడుకార్డులు పూర్తిచేసి ప్రక్కన పెట్టాను. దానయ్య ఇంకా రాలేదు. దానయ్యను ఏ పనిమీద పంపించినా ఇంతే. ఆలస్యం చేస్తాడు. ఎక్కడికి వెడితే అక్కడే కూర్చుంటాడు. తలుపుకు అవతల అడు గుల చప్పుడు వినిపించింది. గుమ్మం వైపు చూశాను. దానయ్య కాదు. రాఘ వయ్య వచ్చారు.

'ఏమిటీసార్! అందరూ ఆడుకుం టూంటె మీరింకా ఈ ప్రోగ్రెస్ కార్డు లను వదల్లేదు.' అన్నాడు రాఘవయ్య నవ్వుతూ.

'ఇంకా పూర్తికాలేదండి' అన్నాను

రాఘవయ్య నా దగ్గరగా వచ్చి నా ప్రక్కనే ఉన్న కుర్చీని నా ముందుకు లాక్కుని కూర్చున్నారు.

'నాకీ బెడద నిన్నటితోనే వదిలింది' అన్నాడు.

'మీ ఏడోక్లాసులో ఎంతమంది పాస య్యారు?' అడిగాను.

'ఎంత మంది పాసయ్యారు అని అడగ కండి. ఎంతమంది నెట్టబడ్డారు అని అడగండి.'

'ఏం?'

'నిజం చెప్పమంటారా?'

'చెప్పండి'

'కరక్టుగా దిద్దితే ఓ ఐదుమంది కన్నా ఎక్కువ పాస్ కారండీ. అలా ఇలా చేసి ఓ ఐదుమందిని తప్ప మిగతా వాళ్ళ నందరినీ

వెళ్ళేశాను—స్పైక్. మరి విశాఖ్లాసో?'

'డైభైయ్యైదు పర్సెంట్ రిజల్ట్సు'

'అమ్మో!'

'లేకపోతే వచ్చే సంవత్సరం టెన్త్ క్లాసుకు పిల్లలుండరు ఈ బళ్ళో.'

'ఇక్కడి పోరగాళ్ళకు ఎందుకు వస్తుందండీ చదువు? ఓసారి ఏమైందంటే మా క్లాసువాళ్ళకు ఇంగ్లీషు పాఠం చెప్పి, కఠినంగా ఉన్న పదాలకు అర్థాలు చెప్పి కంఠతా పెట్టమన్నాను. యునిఫాంగా తల ఊపి ఓ యస్ అన్నారంతా. ఆ మరుసటి రోజు అడిగాను. 'లేక్ అంటే అర్థం ఏమిట్రా' అని. నే చెప్తానంటే, నే చెప్తా అంటూ అందరూ చేతులెత్తారు. ఓహ్! మా క్లాసు మారిపోతున్నారనీ, బాగా చదువుకుంటున్నారనీ అనుకుని ఆనందించాను. అందరివంకా చూశాను. అందరూ ఉత్సాహంగా ఉన్నారు. అందరూ చెప్పేట్టు ఉన్నారు. అందరికన్నా ముందు చేయిఎత్తిన కుర్రాడ్ని లెమ్మని 'టి ఎ కె యి టేక్—అర్థం ఏమిట్రా' అడిగాను. వాడు లేచి ఉత్సాహంగా చేతులుకట్టుకున్నాడు. 'మరే సార్. మరీ టేకంటే చెక్క' అన్నాడు.'

రాఘవయ్య చాల గమ్మత్తుగా మాట్లాడుతాడు.

'ఇంకోసారి...' అంటున్నాడు రాఘవయ్య.

అంతలో దానయ్య వొచ్చాడు— ఖాళీ చేతులు.

'టీ ఏది?' అడిగాను.

'టీ లేదండీ— పాలువి రిగిపోయాయంట' అన్నాడు.

ఎవరిమీద కోప్పడాలో అర్థం కాలేదు. తలనొప్పి ఎక్కువైనట్లు అనిపించింది.

'సర్లే వెళ్ళు' అన్నాను.

దానయ్య వెళ్ళిపోయాడు.

హెడ్మాస్టరు మా మాటలు వింటున్నాడో, లేదో తెలియదు. రేపు రిజల్ట్సు బోర్డుమీద అతికించేవరకూ ఆయనకు నిద్రపట్టదేమో!

రాఘవయ్య వంకచూశాను.

'చెప్పండి' అన్నాను.

'ఇంకోసారి సెవన్త్ క్లాస్ కుర్రాకొకడు నాదగ్గరకు వచ్చాడు. వాడు ఇంగ్లీషులో అధిక పూర్, 'మాస్టారూ! మా ఇంట్లో మొక్కజొన్న కండెలున్నాయండీ. పట్టుకొస్తాను' అన్నాడు. 'వద్దురా' అన్నాను. బెండకాయలున్నాయన్నాడు. రాం ములక్కాయలున్నాయన్నాడు. ఆర్డినరీ ములక్కాయలున్నాయన్నాడు. బంగాళాదుంపలున్నాయన్నాడు. ఇవన్నీ తీసుకువచ్చి వాకిస్తానన్నాడు. ఉండుండి వాడికి నామీద అంత ఇది ఎందుకు కలిగిందో నాకు అర్థం కాలేదు. ఏమీ వద్దన్నాను. వాడు బిక్క ముఖం వేశాడు. 'అలా అయితే నాకు ఇంగ్లీషులో మార్కులు వేయండి' అన్నాడు.

నవ్వాగలేదు నాకు.

'అప్పుడేం చేశారు?'

'వాడి జుట్టు అందుకుని వొంచి నాలుగు గుద్దులు గుద్దాను' అన్నాడు రాఘవయ్య.

సిగరెట్ కిటికీలోంచి బైటకు విసిరాను.

రాఘవయ్య లేచినుంచున్నాడు.

'కూర్చోండి సార్ — సంగతులు చెబుదురుగాని' అన్నాను

'నే వెళ్తాను సార్. ఓ ఆట ఆడదామని ఉంది. మీరు కూడా రాకూడదూ?'

తల అడ్డంగా ఆడించి ప్రోగ్రెస్‌కార్డులు ఎత్తి రాఘవయ్యకు చూపించాను.

మిగిలిన ప్రోగ్రెస్‌కార్డులు పూర్తిచేయడానికి అరగంట పైగానే పట్టింది. అన్నీ కట్టకట్టి హెడ్మాస్టరు బల్లమీద పెట్టాను. ఆయన తలెత్తి నావంక చూశాడు.

'అన్నీ పూర్తిచేసినట్లేగా?' అడిగాడు.

తలూపాను.

'నే వెళ్తానండీ' అన్నాను.

నే నిచ్చిన కార్డులు తనదగ్గరకు లాక్కుంటూ 'సరే' అన్నాడు.

బల్లదాటి వెనక్కి తిరిగి రెండడుగులు ముందుకు వేశాను.

'మాట' అన్నాడు హెడ్మాస్టరు.

ఆగి వెనక్కి తిరిగి ఆయనవంక చూశాను. కళ్ళజోడుతీసి బల్లమీద పెట్టాడు. 'రేపు ఉదయం కాస్త త్వరగా అంటే ఎనిమిదిగంటలకే రండి. పార్టీ ఉంది' అన్నాడు.

'సరే.'

గది బైటకు వచ్చాను.

వాలీబాల్ కోర్టు ఆటలో మునిగిపోయి హడావిడిగా ఉంది. గాలి చల్లబడుతోంది. స్కూలు ఆవరణ ప్రశాంతంగా ఉంది. దారి కిరుప్రక్కలా వున్న పూలమొక్కలు ఎండిపోతున్నాయి. గేటుదగ్గర నిలబడి రెండు నిమిషాలపాటు ఆట చూశాను. దానయ్య అంపైర్. రేపు వెళ్ళిపోడానికి పెట్టె బేడా సర్దుకోవాలని గుర్తుకురాగానే బైటకు వచ్చాను.

ఎదురుగా రామయ్యతాత కొట్టు ఉంది. కొట్టుదగ్గరకువెళ్ళి సిగరెట్ పేకట్ కొనుక్కుని ఒక సిగరెట్ తీసి వెలిగించాను.

'మా పోరగాళ్ళు పరీచ్చల్లో నెగ్గిండ్రా లేందీ ఎప్పుడు సెబుతారండీ సంతులు గోరూ?' అడిగాడు రామయ్యతాత.

'రేపు' అన్నాను.

'ఇస్కూలుకు సెలవలో?'

'రేపట్నాంచే'

'ఇస్కూలు తెరిశేక తమ రిక్కడికి ఒత్తారా?'

'ఉహూఁ.'

'ఏం?'

'పై చదువులకు వెళ్దామని ఉంది తాతా.'

'ఏం ఈడ బాగా లేదా?'

'బాగానే ఉంది'

అక్కడ వుండ బుద్ధికాలేదు. 'వస్తాను తాతా' అని ముందుకు నడిచాను.

ఎర్రటి ఇసుక చెప్పులకు అంటుకుంటోంది. కాళ్ళు ఎర్రంగా అవుతున్నాయి. ఇంటికి వెళ్ళాలి. స్నానం చేయాలి. భోజనం తయారు చేసుకోవాలి. పెట్టె బేడా సర్దుకోవాలి. ఈ జీవితంమీద మునుపున్న ఆసక్తి ఇప్పుడు ఉండడంలేదు తగ్గిపోతుంది. ఇంకొక్క రోజు...

భోజనంచేసి నిద్ర పోవటానికి ప్రయత్నిస్తుంటే తలుపు తట్టిన చప్పుడైంది. లేచి కూర్చున్నాను.

'ఎవరూ?'

'నేనండీ—యాదగిరిని.'

వెళ్ళి తలుపు తీశాను. యాదగిరి జుట్టు రేగిపోయి ఉంది. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. పరుగెత్తూ వొచ్చాడులా ఉంది. అలుపు ఇంకా తగ్గలేదు.

'ఏమిట్రా, ఇంత రాత్రిపూట వచ్చావు?' అడిగాను ఆశ్చర్యపోతూ.

'మాస్టారూ!...' అని ఆగాడు. నుదుటిమీద పడిన జుట్టును వెనకకు నెట్టు

# నీడలేని పందిరి

కున్నాడు. ముఖమంతా చెమట పట్టి ఉంది.

'చెప్పరా.'

'మీతో ఒక విషయం చెబుదామని వచ్చానండీ.'

'నాతోనా?'

తలూపాడు. జుట్టు తిరిగి నుదుటిమీద పడింది.

'ఏమిటి?'

'బైటకు వెళ్దాం రండి.'

'సిగరెట్ పేకట్, అగ్గిపెట్టె తీసుకుని, తలుపువేసి గొళ్ళెంపెట్టి యాదగిరి ప్రక్కనే నడవసాగాను.

'ఎక్కడివరకు?' అడిగాను.

'చెరువు కట్టమీద కూర్చుందాం.' అన్నాడు.

యాదగిరికి పధ్నాలుగు సంవత్సరాలుంటా యేమో. సన్నగా, నల్లగా ఉంటాడు. కీచు గొంతు. తొమ్మిదోక్లాస్ చదువుతున్నాడు. ఆ ఊరి ప్రెసిడెంట్ వెంకటసామి కొడుకు. తొమ్మిదోక్లాసుకు క్లాస్ టీచర్‌ను నేను. వాడు మహావేటర్. వాడికి పొట్ట పొడిస్తే అక్షరం ముక్క రాదు. పెద్ద పోజుగాడు. గీర్వాణం మటుకు తండ్రి కున్నంతా ఉంది. టీచర్లంటే లెక్కలేదు. చాల గీరగా మాట్లాడుతాడు. అందుకే వాడంటే నాకు చిరాకు, కోపం, అసహ్యం, మంట.

పరీక్షలకు ముందు వెంకటస్వామి నా దగ్గరకు వొచ్చి యాదగిరి సైన్సులో పూర్ అని మార్కులు వేయమని అన్నాడు.

'చూద్దాం లెండి' అన్నాను.

'చూద్దామంటే ఎట్లా పంతులూ! డబ్బులు కావాలంటే...' ఆగి చుట్ట పొగ నా ప్రక్కగా వదిలాడు.

ఆయన పిల్లికళ్ళు ఎప్పుడూ ఎర్రగా ఉంటాయి.

'డబ్బులు తీసుకుని పాస్‌చేసే అలవాటు నాకు లేదండోయ్' ఏడుపురాక నవ్వుతూ అన్నాను.

'ఇష్టం ఎట్లాఐనా సరే మావాడ్ని కాస్త ఈ తొమ్మిది గట్టెక్కించేస్తివో... నీమేలు మర్చిపోలేను...' అని వెళ్ళిపోబోతూ ఆగి నా కళ్ళల్లోకి సూటిగా చూశాడు. ఏదో అనబోయాడు అనలేదు.

మోడిఫైడ్ ఆజ్ఞ అది. పాటించడం ఆత్మను వంచించుకున్నట్లవుతుంది. అయినా యాదగిరి ఒక్క సైన్సులోకాదు. ప్రతి సబ్జెక్ట్‌లోనూ 'పూర్.' ఏంచేసేది?

చెరువుగట్టుమీద కూర్చుని సిగరెట్ తీసి వెలిగించాను. యాదగిరి నా ప్రక్కనే కూర్చున్నాడు. వెన్నెల మిగిలివున్న నీటి మీద పొడుగా పడి మెరుస్తూ కదులుతోంది. చల్లటిగాలి వీస్తోంది. తొమ్మిది గంటలకే ఊరు సద్దుమణిగింది. యాదగిరి ముఖంలోకి చూశాను. లోతుకళ్ళు ఆకాశంలో ఎగురుతున్న తెల్లటి మేఘాల వైపు చూస్తున్నాయి.

'చెప్పరా' అన్నాను

యాదగిరి ఉలిక్కిపడి నావంక చూశాడు. తల వొంచుకున్నాడు. అరనిమిషంపాటు కుడిచేతి చూపుడువ్రేలితో నేలమీద పిచ్చి గీతాలు గీశాడు తలెత్తాడు.

'మా రిజల్ట్సు ఎప్పుడు చెబుతారండీ?' అడిగాడు.

'నీకు తెలీదా?' కోపంగా అడిగాను.

యాదగిరి జవాబు చెప్పలేదు. తిరిగి తలవొంచుకున్నాడు. నేలమీద గీచిన పిచ్చి గీతలు చెరిపి వేశాడు.

'మీ ఊరు ఎప్పుడు వెళ్తారండీ?'

'రేపు'

'రేపు పదకొండు గంటల బస్‌కా?'

'ఉన్నది అదేకదా.'

'మళ్లీ రారు కదూ!'

'రాకూడ దనుకుంటున్నాను.'

యాదగిరి చేతులు దులుపుకున్నాడు. తలెత్తాడు.

'నాకు సైన్సులో ఎన్ని మార్కులు వచ్చాయండీ?' అడిగాడు.

యాదగిరికి సైన్సులో ఎన్నిమార్కులు వచ్చాయో నాకు బాగా గుర్తుంది. అసలు పదివస్తే పదిహేను చేశాను. ఇంగ్లీషులో ఇరవై. ఎలిమెంటరీ మేథమెటిక్స్‌లో తొంభై. లెక్కల మాస్టారుదగ్గర ప్రైవేటాయె,!

'నాకు తెలియదురా—గుర్తులేదు.' అన్నాను.

యాదగిరి నా కళ్ళల్లోకి సూటిగా చూశాడు, చిన్నగా నవ్వి, 'నాకు పదిహేను వచ్చాయట' అన్నాడు.

ఉలిక్కిపడ్డాను. సిగరెట్ జారి గట్టుమీదుగా క్రిందకు దొర్లింది.

'ఇంకా ఎక్కువే వచ్చినట్లు గుర్తు అబద్ధం ఆడాను.

# నీడలేని పందిరి

'కచ్చితంగా పదిహేను వచ్చాయట.'

'ఎవరు చెప్పారేమిటి?' విసుగ్గా అడిగాను.

'ఈ సాయంత్రం మా నాన్న హెడ్మాస్టరు గారిని కనుక్కుంటె తెలిసింది...అసలు... నేను తప్పానట...' అన్నాడు యాదగిరి.

ఈ ఎడ్యుకేషన్ మీద అపరిమితమైన జాలి వేసింది.

మరో సిగరెట్ తీసి వెలిగించాను. హెడ్మాస్టరుమీద కోపం ముంచుకు వస్తోంది. మనసు పిచ్చి ఆవేశంతో, కలతతో నిండి పోసాగింది.

మాస్టారూ! నాకు చదువు రాదండీ! చదువుకోనంటే మా నాన్న ఊరుకోడు. తంతాడు. మా అన్న చదువుకుంటానంటే వీల్లేదని పొలానికి పంపుతున్నాడు. నన్ను డాక్టర్ కోర్సు చదివించాలని అనుకుంటాడు. ఏ సంవత్సరానికా సంవత్సరం మాస్టర్లను డబ్బులిచ్చో, భయపెట్టో నన్ను పాస్ చేయిస్తున్నాడు... నా మెదడు ఎంత మొద్దో...' యాదగిరి ఆగాడు. కంఠం గాద్గదిక మౌతోంది.

ఈ రోజు యాదగిరి నాకెందుకో కొత్తగా అపిస్తున్నాడు. వాడి ధోరణి నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేస్తోంది,

కొద్దిసేపు మౌనంగా ఉండి, 'మాస్టారూ! రేపు మీరు వూరెళ్ళకండి. రాత్రికే మీ వూరు వెళ్ళిపొండి.' అన్నాడు యాదగిరి.

యాదగిరి కళ్ళల్లోకి సూటిగా చూశాను. వాడి కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. పెదాలు విపరీతంగా వణుకుతున్నాయి. రెండు చేతులూ జోడించాడు.

'నమస్కారం పెడ్తాను మాస్టారూ! మీరంటే నాకు చాల ఇష్టం. నిజం. నన్ను నమ్మండి. మీరు రాత్రికే ఈ వూరు వొదిలి వెళ్ళిపొండి' అన్నాడు ఏడుస్తూ.

'ఎందుకు?'

'నాకు మార్కులు వేసి నన్ను పాస్ చేయించలేదని మా నాన్నకు మీ మీద కోపం వచ్చింది. రేపు మీరు బస్ ఎక్క బోయేలోగా మిమ్మల్ని కొట్టిద్దామని మా నాన్న ప్రయత్నిస్తున్నాడు' అన్నాడు యాదగిరి.



# వైజ్ఞానిక గాథావళి-97



# భూమి కథ...

సముద్రపు జలాలలో కరిగియున్న పదార్థము కూడి వేరై భూమి అయిందన్నాడు సెనెకా. నక్షత్రాల ఆకర్షణకు భూమి సముద్రము పైకి వచ్చిందన్నాడు డాంటే. 1749 లో జార్జ్ లూయీ లెక్లెర్క్ ఆకాశాంతరాళంలో తిరుగుతూండిన పెద్ద తోకచుక్క సూర్యుడితో ఢీకొన్ని వుండాలి, ఈ సంఘట్టనము వల్ల తోక చుక్క వస్తువు కొంత సూర్యుడిలో కలిసిపోయినా, చిన్న భిన్నమైన మిగతా వస్తువు తొమ్మిది గ్రహాలకీ సరిపడి, గ్రహమండలముగా ఏర్పడిందన్నాడు. 1900 లో ఛేంబర్లేన్, మౌల్టన్, అనే అమెరికను వైజ్ఞానికులూ, తరవాత జేమ్స్‌జీన్స్ అన్న బ్రిటిషు వైజ్ఞానికుడూ, 'తోకచుక్క ఢీకొన నక్కర లేదూ, సూర్యుడి కంటె ఏ పదిరెట్లో పెద్దదైన నక్షత్రము సూర్యుడికి కొంత చేరువగా వచ్చిపోతే చాలూ, ఆ నక్షత్రపు ఆకర్షణకి సూర్యుడిలోని జ్యోతిర్వస్తువు పెద్ద పొగమట్టలాగ లాగబడి ఆ నక్షత్రము కాస్తా దాటిపోయిన తర్వాత నెమ్మదిగా ద్రవీభవించీ ఘనీభవించీ గ్రహాలుగా ఏర్పడవచ్చునూ, అన్నారు. గ్రహాలన్నీ ఒక టేబిలు మీద అమర్చి వుండిన వాటిలాగ ఒకే తలములో ఒకే ముఖంగా సూర్యుడి చుట్టూ తిరుగుతూండడమూ, తొలి గ్రహము అయిన బుధుడి నుంచి, చివ్వరి గ్రహము ప్లూటో వరకూ నడిమి గ్రహాలు క్రమంగా పెద్దవవుతూ చిన్నవి కావడమూ జీన్సు పండితుని వూహకు మద్దత్తు. 1960 లో వూల్ఫ్‌సన్ అన్న ఇంగ్లీషు వైజ్ఞానికుడు ఈ వాదానికి అదనపు బలం చేకూర్చి, 12 గంటలలో అన్ని గ్రహాలూ ఏర్పడి పోయాయనీ, ప్లూటో యురేనస్ శని, గురు— గ్రహాలు ఆ పెద్ద నక్షత్రము చేరువగా వస్తున్నప్పుడూ, అతి చేరువగా వున్నప్పుడు యూరేనస్‌లు..., అది వెళ్లిపోతూన్నప్పుడు అంగారక, భూమి, శుక్ర, బుధ గ్రహాలూ ఏర్పడ్డాయని లెక్క వేసి చెప్పేడు.

అయితే ఇలాగ నక్షత్రాలు— పెద్దవి చిన్నవి విసురుకు పోతూంటే ఖగోళాలన్నీ చిందరవందరైపోవా? అన్న ప్రశ్న పుట్టుతుంది. సూర్యుడి నుంచే గ్రహాలన్నీ విడిఉండినట్లయితే తనచుట్టూ తాను తిరుగుతూ ఉండే తత్వము సూర్యుడిలోనే ఎక్కువగా ఉండి, గ్రహాలకు కొంచెము కొంచెమే అంది వుండాలి గదా?— మరి గ్రహాలన్నిటికీ చేరి, నూటికి 97 పాళ్లు ఉన్న ఈ భ్రమణ ఆవేగము సూర్యుడికి 3 పాళ్లు మాత్రమే ఉన్నదేమి? అన్న విమర్శ పుట్టింది. 1796 లో లాప్లాస్ అన్న ఫ్రెంచి గణితజ్ఞుడు ఒక నక్షత్రము పెద్దగా పేలి నక్షత్ర వస్తువును లక్షలాది మైళ్ల దూరానికి విసిరేస్తే, అమహా ధూళి గోళము నక్షత్రపు భ్రమణా వేగాన్ని ఆకళించుకుని తిరుగుతుంది అన్నాడు. ఇలాగ తిరుగుతూ చల్లారి నప్పుడు అది కుంచించుకుని చిన్నదవుతూ ఇంకా త్వరగా తిరుగుతుంది. క్రమంగా ఆ ధూళి మేఘము వాపి రూపానికివచ్చి, వేగము ఎక్కువైనప్పుడు అంచు వెంటా చీలిక ఏర్పడి ఒక రింగు లాగ విడిపోవచ్చునన్నాడు. ఇది విడిపోగా మిగిలిన దానికి భ్రమణావేగము తక్కువ అవుతుందీ, ఇంకా ఇంకా చల్లబడి కుంచించుకోగా మరియొక రింగు విడిపోతుంది. ఇలాగ తొమ్మిది రింగులను విసరి మిగిలినది సూర్యుడైనదట. ఆ రింగులలోని వస్తువు దగ్గరగా కూడి గ్రహాలైనదట. ఈ వాదము సరదాగా వుంది గాని, మాక్స్‌వెల్ అన్న స్కాచ్ వైజ్ఞానికుడు ఆ పల్చని రింగులు శని గ్రహపు రింగులవలె నిల్చిపోక, దగ్గరగా కూడి గ్రహగోళాలుగా ఏర్పడేటంత ఆకర్షణ ఆ ధూళి రింగులలో ఎక్కడిదీ? అన్న గడ్డు ప్రశ్న వేశాడు.

ఈ ప్రశ్నలన్నిటినీ కలుపుకుని వీటికి జవాబు చెప్పే వాదము లేవదీశాడు వైజెకర్ అన్న జర్మన్ విజ్ఞాని. నక్షత్రాల నడిమి చోటులో శూన్యము కాక పలాచని జ్యోతిర్మేఘాలు— వెలుగే లేనివి— నెబ్యులాలనేవి— ఉన్నాయి. వీటిలో నూటికి 99 పాళ్లు తేలికైన హైడ్రోజనూ హీలియములున్నూ ఒక్క భాగము బరువు మూలకాలున్నూ ఉన్నాయి. ఇలాటి, చల్లని కాంతి రహిత నక్షత్ర వస్తు మేఘము కుంచించుకోవడము వల్ల మన సూర్యుడి కంటె చాలా పెద్దదైన గోళము ఏర్పడిందటూ, నూటికి ఆరుపాళ్లు దీనివెలపల దిగబడిపోయి ప్లూటో గ్రహమున్నంతవరకూ విస్తరించి ఉండినదట. దీనికి తిరుగుడు ఎలావచ్చిందో కాని వచ్చింది. ఈ గోళము తిరుగుతూ రింగుల్ని కాక,— దీని వస్తువులో వుండిన చిక్కదనపు భేదాలవల్ల— ముద్ద ముద్దలుగా విడదీసుకున్నదట. ఈ ముద్దలలో వస్తువు తిరుగుతూనే వుంటుందీ, కేంద్రపు ముద్ద సైజులో (సైజులో మాత్రమే) చిన్నదిగా వుండి దూరదూరపు ముద్దలు క్రమంగా విస్తరించుకుని వుంటాయి. ఐదేసి ముద్దలు ఒక్కొక్క రింగునించి విడతాయిటా, లోరింగు యొక్క బయటి అంచూ బయటి రింగు యొక్క లోఅంచూ ఒకదాని కొకటి వ్యతిరేకంగా తిరుగుతూ వాటిలోని కణాలు చేరుకోడము



వల్ల గడ్డలుగా ఏర్పడతాయిట. ఇవి ధూళిని బాగా లాక్కుని గ్రహాలైనాయిట. గ్రహాల చుట్టూ వున్న వాయువు సూర్యరశ్మి వల్ల తోపుడుపడి, దగ్గర గ్రహాలది ఎగిరి పోయిందటూ దూరపు గ్రహాలది వాటి దట్టపు వాతావరణంగా ఇంకా నిలిచి వున్నదట.

వైజెకరు వాదము సూర్యమండలమును గురించి మనకు తెలిసిన తబిశీళ్ల నెన్నిటినో అన్వయిస్తుంది. అయినా దీనికీ అభ్యంతరాలుంటాయి. సూర్య కుటుంబము హఠాత్తుగా ఒక నక్షత్రము ఇంకొక (సూర్యుడి వంటి) నక్షత్రానికి చేరువగా దూసుకు పోడము వల్ల ఏర్పడిందన్న వాదమూ, ఒక నక్షత్రము పేడము వల్ల ఏర్పడిందన్న క్రమపరిణామ వాదమూ ప్రతి వైజ్ఞానిక శాఖలోనూ ఉన్నాయి. జీవసృష్టి భూమి మీద మాత్రమే ఉన్నదంటుంది మొదటి వాదము. భూమి లాటి గ్రహాలు సూర్యుడిలాటి నక్షత్రాలన్నిటికీ వుండవచ్చునూ, కనక భూమి మీద ఉన్నలాటి జీవము చాలా చాలా ఖగోళాల గ్రహాలలో వుండవచ్చునంటుంది రెండో వాదము.

# భారతదేశంలో ఆధునిక చిత్రకళ

ఖండవల్లి శేషగిరిరావు

భారతదేశంలో చిత్రకళ క్రమంగా మార్పు చెందుతూ ఇప్పుడిప్పుడు ఒక ప్రత్యేక రూపాన్ని పొందుతూవుంది. అసలు భారతీయ చిత్రకళను గురించి చర్చించడానికి ముందు దానిని మత, వేదాంత, కళా సాంప్రదాయాలు పటిష్టం చేసినవని, గత కాలపు సృజనాత్మకశక్తి, పురోగతి, భావసంబలములు దానిని పెంపొందించినవని మనం జ్ఞాపకముంచుకోవాలి. అలాకాకుంటే ప్రస్తుతం భారీ ఎత్తున కళారంగములో జరిగే కార్యకలాపాలు అర్థం లేనివిగా కనిపిస్తాయి.

అసలు ఆధునిక చిత్రకళ అన్నదానిని సరిగా అర్థం చేసుకోవాలంటే నవ్యత్వానికి ప్రాధాన్యతను యిస్తూ గతకాలంలో చిత్రకళ యేవిధంగా పురోగమించినదో మనము పరిశీలించాలి. చిత్రకళ అన్నది సమకాలీన యుగంలో చరిత్రాత్మకంగా వివరించడానికి వీలులేనట్టిదిగా అప్పటికప్పుడు ఉద్భవించిన వింత యనడానికి ఆస్కారం లేదు. కొన్ని సంవత్సరాల క్రితం అంతరిక్షనౌక సోవగ్యోస్ మానవుడ్ని దిగ్భ్రాంతి గొలిపినట్లు ఈ ఆధునిక చిత్రకళలోని నవ్యత్వం కూడ ఆశ్చర్యపరచిన దనడంలో సందేహం లేదు.

19 వ శతాబ్దం చివరి రోజుల్లోనావెలో మహాచరుడైన అవనీంద్రుడు ప్రతికరణ శుద్ధిగా జాతీయ చిత్రకళా విధానాన్ని పునరుద్ధరించాడని చెప్పవచ్చు. ఆయినా, ఆయన శిష్యులు కలిసి భారతీయ పద్ధతిని అనుసరించే వివిధ దేశ సూక్ష్మ చిత్రకళా పద్ధతులను ఆసక్తితో పరిశీలించి, పరిశోధనలు జరిపి కొత్త జాతీయతను తీసుకురావాలన్న సంకల్పంతో భారతీయ చిత్రకళలోని ప్రాచీనమైన కళాఖండాలను నకళ్ళుగా తయారుచేసి అనుకరించడం ప్రారంభించారు. కొద్దికాలములోనే జాతీయ సంస్కృతి, సాంప్రదాయమున పోయినటువంటి ఆత్మగౌరవాలను తిరిగి సంపాదించుకోడానికి జరిగిన ఉద్యమంలోని నవోత్సాహరీతులకు క్రమంగా చిత్రకళ వశమైంది.

'ఆధునిక చిత్రకళ' అంటే ఆకారం, రంగు, రూపానికి సంబంధించిన రేఖలను సమన్వయపరచి వైజ్ఞానిక పరిశోధకునివలె కొత్త దారులను తొక్కి నూతన కళాకృతులను చిత్రీకరించటమే.

అసలు ఆధునిక చిత్రకళను అర్థంచేసుకోవాలంటే మొదట నేటి సమాజంలోని మార్పులను అవగతం చేసుకోవాలి. స్వాతంత్ర్యానంతరమే ఆధునిక చిత్రకళయొక్క ప్రభావం విరివిగా ప్రచారంలోకి వచ్చిందనటమే సమంజసం. జాతిలో చైతన్యం పెరిగి అంతర్జాతీయతను అనుసరించినది. భారతీయులు ప్రస్తుతం యిదివరకటికంటే ఎక్కువగా విదేశాలు చూచిరావటం జరుగుతున్నది. మిత్రదేశాలతో సంస్కృతి సంబంధాలను పరస్పరం తెల్పుకోవడం మామూలు అయింది. ఈ మార్పిడివల్ల చిత్రకళా రంగంలో ఆధునిక అంతర్జాతీయరీతులలో చక్కని పరిచయమేర్పడింది.

## చిత్రకారుడు - సాంకేతిక నిపుణుడు

నూతన ప్రక్రియలు, కొత్త విధానాలు చిత్రకళారంభనలో సాంప్రదాయపద్ధతిని కాన్వాసును, రంగులను, కుంచెల నుపయోగించటమే కాకుండా కల్పనాశక్తితో విప్లవాత్మకమైన జగత్తును సృష్టించగల సాంకేతిక నిపుణుడిగా నేటి చిత్రకారులు తయారవుతున్నారు. కాని వీరిలో ఏ కొద్దిమందో ఈనూతనకల్పనలను అర్థం చేసుకున్నవారు తప్ప చాలమంది సమకాలీనమైన చిత్రణారీతికోసం తాపత్రయపడుతూ సాధారణ చిత్రకారులైనవారు (ప్రజ్ఞ ఎక్కువగా లేనివారు) అంతర్జాతీయంగా కళారంగంలో చలామణిలయ్యే పదజాలాన్ని అలాగే అనుకరించుతున్నారు. ఈ అనుసరణ వల్ల నిజరూపం యే తప్పుదోవలకో పడుతుంది.

ఈ ఆధునిక కళకు సరియైన ప్రచారం లేనప్పటికి, చిత్రకారులు ఆధునికకళ పరిజ్ఞానాన్ని పెంపొందించుకుంటున్నారు. కళా విమర్శకుల విమర్శనల మూలముగా ఆధునిక చిత్రకళయందు పరిష్కారము కావలసిన సమస్యలనేకములున్నవి.

ముఖ్యముగా లలితకళా ఎకాడమీ ఆధునిక చిత్రకళ భావిని తీర్చిదిద్దే బాధ్యత పడింది. ఉన్నతమైన జాతీయసంస్థగా లలితకళను పోషించి వాటి అభివృద్ధికై నేటి భారతీయ చిత్రకళను ముందుకు తీసుకువెళ్లే ప్రభావము తప్పనిసరిగా అమలులో నుంచవలసి ఉన్నది. కాని ప్రస్తుత కాలంలో ఆధునిక చిత్రకళను పూర్తిగా అర్థంచేసుకొనే స్థితి యింకా రాలేదు. భవిష్యత్తులో అది ప్రవేళ్లు పాతుకొని, పెరిగ విస్తరించి తన వ్యక్తిత్వపు గాంభీర్యాన్ని నిలుపుకోగలదని ఆశిద్దాము.

[శ్రీ కె. శేషగిరిరావు ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్ర కారుడుగా పాఠకులకు సుపరిచితులే. —సం॥]



సీరియల్

తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారికి బాగా జబ్బుగా ఉందని తెలిసి, ఆప్తమిత్రుడు కామయ్య మేష్టరూ, ఆయన చేరదీసి పెంచిన అనాధబాలుడు ప్రసాద్ ఆయన్ని చూడటానికి వెడతారు వెంకట్రామయ్యగారు అంతకుముందు ఇచ్చిన పదివేలుకాక మరొక పదివేల ప్రసాద్‌కి ఇవ్వాలనుకుంటారు వెంకట్రామయ్యగారి కొడుకు మధు వూరినుంచి వస్తాడు ఉత్తవంలో కామయ్య మేష్టారి కూతుళ్లు శారద, భానులని కలుస్తాడు అతని మేనమామ కూతురు ఊర్మిళ బొమ్మలకొలువు చూడటానికని మధు కామయ్య మేష్టారి ఇంటికి వెడతాడు వెంకట్రామయ్యగారు పోతారు ఆయన భార్య అచ్చమ్మ శివరామయ్యను పిలిచి మధుకు మేనరికాన్ని ఒప్పిస్తుంది

## 6

మళ్లీ మూడు గంటలకుగానీ మెళుకువ రాలేదు పొద్దు తిరగటం వలన, నీడ దాటిపోయి బాగా ఎండ తగలటాన లేచి కూర్చున్నాడు చప్పున చన్నీళ్లతో ముఖం కడుక్కొని లాల్చీ—పైజామా తగిలించుకొని 'మాష్టారు ఎంతసేపయింది వెళ్లి నన్ను లేపకూడదూ' అన్నాడు శారదకేసి చూస్తూ, బొత్తాములకై టేబిల్ సొరుగు లాగి.

ఆమె వాలుకుర్చీలో కూర్చుని ఏదో లావుపాటి నవల ఒకటి చదువుకొంటోంది పుస్తకంలోనుండి తల ఎత్తి 'నాన్ననే నిన్ను లేపవద్దని చెప్పి వెళ్లిపోయ్యారు ఒక్క నిముషం ఆగు' అంటూ లోనికెళ్లి తిరిగి వచ్చింది ఆమె చేతిలో ఖరీదైన ఉన్ని పంట్లాం, షర్టు, టై.

'ప్రసాద్—ఈ 'పంట్లాం—షర్టు' నీకు చాలా బాగుంటాయ్! అందుకనే వీటి మీదకు ఈ 'టై' చక్కగా నప్పుతుందని నేను కొన్నాను ఇది నీకు నా 'బర్త్‌డే ప్రెజెంటేషన్' అంది.

అది అతనికి అపూర్వ దృశ్యంలా కనిపించినట్లు రెప్పవాల్చక దానికేసి చూశాడు అందమైన సుకుమారమైన ఆమె చేతివేళ్ళ మధ్యన ఉంది ఆ నెక్ టై అతనిలో అనిర్వచనీయమైన అనుభూతి కల్గింది కృతజ్ఞతతో పొంగులు వారుతూన్న హృదయాన్ని కూడదీసికొని 'థ్యాంక్స్, శారదా' అన్నాడు ఉద్వేగపూరితమైన కంఠంతో.

'థ్యాంక్స్ కోసం కాదు, నీ కిస్తోంది ఇప్పటికిప్పుడే ఆ లాల్చీ, పైజామా మార్చుకొని 'టకప్' చేసికొని ఇది కట్టుకో 'రేపు చూసిరత రాసుకు రాకపోతే బయటికి పంపిస్తానని బెదిరించేలా ఉంది ఆ చూపు

'ఓ—గట్టి చిక్కే తెచ్చిపెట్టావ్ ఇప్పటి కిప్పుడే'

'అవును— ఇప్పుడే' ఆమె మొండిగా అంది

'తప్పదా?' కొంటెగా ఆమె కళ్లల్లోకి చూస్తూ గొంతు బిగబట్టి అన్నాను

'తప్పదు' దృఢంగా చెప్పింది

'ఇలా శాసించటానికి ఎవరిచ్చారు నీకీ అధికారం' అంటూ ఆమె చేతిలోనుండి ఆ 'టై' అందుకొని స్పృశించసాగాడు

'శాసించే అధికారం ఎవరో ప్రసాదించితే లభ్యమయ్యేదికాదు అధికారం చెలాయించ గల్గిన శక్తిసామర్థ్యా లున్నవాళ్ళచేతుల్లోకి దానికయి అదేపోతుంది తెలుసా'

ఆమాటలు అతను వినిపించుకోలేదు 'నెక్‌టై'ని పరిశీలిస్తూ కిటికీ వద్దకెళ్లి నిలబడ్డాడు అది తన పంట్లాంకు చక్కగా జత కుదురుతుంది దానిని ఎన్నిక చెయ్యటంలో శారద చూపిన శ్రద్ధాసక్తులకు అతని హృదయం మరోసారి కృతజ్ఞతతో నిండిపోయింది

అంతలో భాను బయటనుండి వచ్చింది ఫ్లాస్క్ చేతపట్టుకొని 'నాన్న నిన్ను త్వరగా రమ్మని చెప్పాడు ఇంకా నిద్ర లేవలేదా అన్నారు త్వరగా వెళ్లు' అంది

'త్వరగా వెళ్లాలనే నే చెబుతున్నా కానీ ఇవన్నీ తగిలించుకొని వెళ్లమంటుంది మరి నీ ఓ టెవరికి '

'అక్కయ్యకే' ఇద్దరి ముఖాలలోకి తేరిపారజూసి సమాధానమిచ్చింది

'చంపావ్—పో అయితే ఒక్క నిముషం ఆగండి' అంటూ బట్టలు తీసికొని ప్రక్క గదిలోకి వెళ్ళాడు

'అయ్యో— ఇంకెంతసేపు ఆడవాళ్ళనంటారుగానీ మగవాళ్లే ఎక్కువ 'టైమ్' తీసికొంటారు ముస్తాబు చేసికోటానికి!' శారద అంది

'వస్తున్నా వస్తున్నా ' అంటూనే పదిహేను నిముషాలకు బయటికొచ్చాడు అతన్ని ఆ పాదమస్తకం పరిశీలించారు అక్కా చెల్లెళ్లిద్దరూ బట్టల దుకాణం ముందు నిలబెట్టిన 'షోరూమ్' బొమ్మలా అతను ఒకే భంగిమలో నిలబడ్డాడు ఉత్కంఠతతో చుట్టూ తిరిగి చూశారు ముఖబింబాన్ని పరిశీలించటానికి శారద ప్రత్యేకమైన శ్రద్ధ తీసికొంది

అతను పెట్టుకొన్న నల్లకళ్ళద్దాలు ముఖానికి ప్రత్యేక శోభ నిచ్చాయి చెంపలు మాత్రం కొద్దిగా వాడిపోయి లోపలికి పొయ్యాయి

'ఏం? దసరాబుల్లోడిలా ఉన్నానా?'

'నో నో' భాను అంది 'అచ్చం నీవు ఇప్పుడు 'మధు'లా ఉన్నావ్ మీ ఇద్దరికీ వ్యత్యాసమేమంటే నీవు అతనికన్న పొడుగు. అతను నీకన్నా బాగా ఎరుపుగా ఉంటాడు. కాదక్కాయ్' అక్కయ్యకేసి చూసింది

శారద పరిశీలనగా చూస్తూ 'అవును

ప్రసాద్. దేవుడిచ్చిన సహజమైన అందాన్ని పోషించుకొనే తాహతు కూడ ఉండాలి. శ్రీమంతులిళ్ళల్లో చూడు. దాదాపు అందరూ ముద్దుగా మిసమిసలాడుతుంటారు. అందువలనే అందంగా అనిపిస్తారు'... వ్యాఖ్యానించింది.

'అది సరేలేకానీ... ఇంతకూ నేనెలా ఉన్నాను చెప్పు' చిన్నపిల్లవాడులా సంబరపడుతూ కుతూహలంగా అడిగాడు.

'సర్టిఫయిడ్... రేపటినుండి ఆ దిక్కుమాలిన పైజమాలు వేసికొని మున్సిపాలిటీవాళ్ళకు పని తగ్గించకు. ఆడపిల్లల పరికిణీల్లా ఎందుకవి? చూడు ఎంత ముచ్చటగా ఉన్నావో' అద్దం తెచ్చి ముందు పెట్టింది.

అతను కనుబొమలు ఎత్తిపెట్టుకొని, పెదవులుకూడ తీసికొని, కాలర్ సరిచేసి కొంటెగా అద్దానికి దగ్గరగా కొద్దిగా దూరంగా మరింత దూరంగా, ప్రక్కకు తిరిగి చూసికొన్నాడు. అతని ముఖంలో సంతృప్తి కనిపించింది.

'టెస్ట్ అయిపోయినట్టేనా? ...ఊడ దీస్తున్నా' అన్నాడు.

'ఊడ తీసికోటానికైతే గంటసేపు శ్రమపడి ముస్తాబు చేసికోవట మెందుకు?' కోపంగా చూసింది.

'మన ఊరి సంగతి నీకుతెలియని దేముంది కాదా?... 'పిడికికూడ సూట్లు బూట్లు కావాల్సొచ్చాయి....' అంటారు. నన్ను ఇలా చూస్తే అందరికీ కళ్ళుకుడ్తాయి. అందుకు'

'ఒక్కరోజుకు ఏమీ కుళ్ళుకోరులే... ఉంచేసుకో.' తేలిగ్గా పరిష్కారమార్గాన్ని చూపెట్టింది భాను. కానీ ఇద్దరిలో ఎవరూ వినిపించుకోలేదు.

'అదే నాకిష్టంలేదు ప్రసాద్...ఎప్పుడూ నీవంతే...ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటావ్?...ఎవరో ఏమో అంటారని ఎందుకలా ఇతరుల అభిప్రాయాలకు అనవసర ప్రాముఖ్యతనిస్తావ్...ఆ 'మధు'ని చూశావా? మొన్న తెప్పతిరునాళ్ళరోజు ఎలా హుషారుగా తిరుగుతున్నాడో, 'గ్రాండ్'గా టకప్ చేసికొని సంతోషంగా చెరువుకట్టమీద స్నేహితులను వెంటవేసికొని హాయిగా తిరిగాడు...అతన్ని వేలెత్తి చూపించరేం? అందరూ?'

ఆమె ముక్కుపుటాలు ఎగిసి పడ్డాయి. మొదట ఆమె కంఠంలో కొద్దిగా ఆవేశం



కన్పించింది. సుశిక్షితమైన బాలిక కాబట్టి తన అనవసరపు ఆవేశాన్ని అదుపులో పెట్టుకొని కంఠస్వరాన్ని సహజమైన స్థాయికి తగ్గించుకొంది. ఆప్రైన కుర్చీలో కూలబడింది.

అతను టేబిల్ పై రెండుచేతులు ఆన్చుకొని నిలబడ్డాడు ఆలోచిస్తూ—ఒకసారి కనుబొమలు ముడివేసికొని మళ్ళీ ఊడదీసికొన్నాడు. ఓ నిముషంపాటు ప్రశాంతత నెలకొన్నది. భాను—ఇద్దరిముఖాలూ పరిశీలనగా చూస్తూ బయటికి నడిచింది.

అతను ఒకనిశ్చయానికొచ్చినట్లు సరిగా లేచి నిలబడ్డాడు.

'అతను వేరూ-నేనువేరు శారదా!...అతను శ్రీమంతుల పిల్లవాడు--- అతను ఏది చేసినా గొప్పగా చూస్తారు. అంత విలువ మనకివ్వరు. సమాజంలో చేతినిండుగా డబ్బున్నవాడే స్వేచ్ఛగా తిరుగ గలడు... ఇతరుల స్వేచ్ఛను అడికట్టగలడు కూడా! నేనిప్పుడలా తిరిగితే వెంకట్రామయ్య పుణ్యానా అంటూ వీడికి అహిరిందని వెక్కిరిస్తారు. అదినేను సహించలేను. తెలిసిందా...'నల్లకళ్ళద్దాలజోడు తీసి బల్లమీద పెట్టాడు. అతనిముఖంలో, నీలినీడలు ఆవరించాయి.

'అనరవి నేననటంలేదు...అయితే దానివలన మనకొచ్చే నష్టమేమీలేదు. పేదవాళ్ళమయినంతమాత్రాన సుఖాన్ని ఆనందాన్ని అపేక్షించకూడదా?...జీవితమంతా ఇతరులను దృష్టిలో పెట్టుకొనే ప్రవర్తించగలమా?... ఇతరులకోసమై మనస్సుని మోసగించి కష్టపెట్టటం ఎందుకు?... 'మధు'... చూడు' అంటూ ఇంకా ఏవేవో చెప్పబోయింది. అతను అడ్డుపడి కాదు.

'అయితే...అచ్చం నేను మధు లానే ఉన్నానా?' నిర్లిప్తమైన కంఠంతో అడిగాడు.

'అవును...అలానే ఉన్నావ్—ఇప్పుడు.'

'నేను 'మధు'లా ఉండటం నీకిష్టమా శారదా?...' కళ్ళు కుంచించుకు పొయ్యాయి. ఆమెకళ్ళలో తత్తరపాటు కనిపించింది. వెంటనే సమాధానం చెప్పలేక పోయింది.

'అయినా...నవ్వా. ఆ'మధు'ని ఎందుకు పోల్చి చూస్తున్నావ్... అతనిలా నేను లేకపోతే [illegible]



ఆమె వ్యాకులపాటును గమనించి ప్రత్యుత్తరానికి ఎదురుచూడక 'టై' ఊడతీసికొని బట్టలు మార్చుకోకుండనే నిర్లక్ష్యంగా బయటికి వెళ్ళిపొయ్యాడు.

ఒకచెంపకు చేతిని ఆన్చి ముందుకువంగి అలా ఉండిపోయింది పదినిముషాలపాటు.

తను తండ్రి అదుపాజ్ఞలలో పెరిగింది. ఆయన తనకు అలవర్చిన మొదటి శిక్షణ మితభాషిత్వం. ఎంత ఆత్మీయులైనప్పటికీ అనవసర ప్రసంగాలు చెయ్యటం చీటికీ మాటికీ పెద్దగా నవ్వటం ఆమెకు అలవాటులో లేవు. ఈ రోజు తను అతిస్వల్ప విషయంపై చేసిన వాదోపవాదాలు, అస్వాభావిక వాచాలతకు సిగ్గుపడి పోయింది.

అతను వేసిన ప్రశ్న ఇంకా తనమెదడులో సుళ్ళు తిరుగుతోంది. అతనిని మరొకరితో పోల్చిచూడవలసిన అవసరం తనకేమీలేదు. కానీ ఆవేళ అతనిని చూసిననాటినుండి ఒక రకమైన ఆలోచనలు తనమదిలో స్థానం కల్పించుకొన్నాయి. వాటి పర్యవసానమే నేటి వాద ప్రతివాదాలు. వాళ్ళిద్దరినీ పోల్చి చూడటానికి కారణం ఎంత వెదికినా అంతు చిక్కలేదు.

కానీ అతనడిగిన ప్రశ్న దుస్సహమైంది. హృదయం గాయపడ్డది. చెయ్యిచాచి ఎవరినో భిక్ష కోరితే కసిరికొట్టి తనను నిరాకరించినట్లు తీవ్ర అభిమానంతో ఆమె మనస్సు విలవిలలాడింది. గట్టిగా కళ్ళు మూసికొని వెనక్కి వాలింది.

'అక్కాయ్... ఈ లెక్క చెప్పు.'

భానూ వచ్చి లెక్కల పుస్తకం అందించింది. నోట్‌బుక్ తీసికొని అంకెలు వేసింది. కొట్టివేసింది—కానీ సరియైన జవాబు రాలేదు. మళ్ళీ మొదలుపెట్టింది పేజీ తిప్పి.

'ఆ...ఆ...తెలిసిందిలే...ఇలాగే ... దీనికి నీవు తప్పు 'రూట్' కట్టావ్' భానూ అంది ఆమె చేతుల్లోనుండి పుస్తకం లాక్కుంటూ.

'తప్పు రూట్ కట్టానా?' ఆమె పెదవులు కొణుక్కొన్నాయి. కొద్ది క్షణాల్లో మళ్ళీ ఆమె వెనక్కివాలి కళ్ళు మూసికొంది. ఎంత కాదనుకున్నా అనివార్యంగా

ఆ విషయం మనస్సులో ప్రవేశించసాగింది.

టేబిల్ పైనున్న గడియారంలో చిన్నముల్లు ఐదువిూదకు జారిపోయింది. భాను లెక్కలు చెయ్యడంలో ఒక అధ్యాయం ముగిసింది. ప్రసాద్—మాష్టారు స్కూల్లో పని ముగించుకొని తిరిగివచ్చారు. మాష్టారు కాళ్ళు కడుక్కోటానికి బావివైపు వెళ్ళారు.

'దీన్ని పాసివ్ వాయిస్‌నుండి—యాక్టివ్ వాయిస్‌కు మార్చాలి, ఎలా?' భాను గ్రామర్ పుస్తకం అందిస్తూ అంది.

'ఇటు...తే...చూస్తా'అంటూ పుస్తకం అందుకొంటూ శారదను పరికించాడు. ఆమె తెల్లని సున్నపుగోడవైపు తదేకంగా చూస్తోంది శిలాప్రతిమలా కూర్చుని.

'శారదా?... ఇందాకటినుండి అలానే కూర్చున్నావా' హెచ్చరించాడు.

ఆమె తలఎత్తిచూసింది. అతని ముఖం ప్రశాంతంగా ఉంది. మధ్యాహ్నం జరిగిన వాదప్రతివాదాలలో అతనుకూడ భాగస్వామి. కానీ ఏమి జరుగనట్లే నిర్వికారంగా ఉన్నాడు. తనలా చిత్తవికారాలకు లోనుకాలేదు. మామూలుగా నవ్వుతూ పలకరించాడు. విస్మయదృష్టితో క్షణకాలం అలానే చూసింది. తన బలహీనత అతను గ్రహించినందుకు సిగ్గుతో కృంగిపోయి లేచి వంట గదిలోకి వెళ్ళిపోయింది.

* * *

సాయంత్రం అయిదున్నర గంటలయింది. ప్రకృతికాంత గర్భంలోకి జారిపోతోంది సూర్యబింబం. గుండ్రంగా ఎర్రగా జ్వలిస్తూన్న సూర్యుడు అలసి నీరసించిపోయినట్లు వాలిపోతున్నాడు తుమ్మలతోపుకు ఆవల.

బీళ్ళల్లో పచ్చిమేతమేసి నెమరువేసికొంటూ, తోకలు ఊపుకొంటూ పశువులు ఊళ్ళోకొస్తున్నాయి. వాటిగిట్టల రాపిడితో దారి పూర్తిగా ధూళిధూసరితమైపోయింది.

అస్తమయ సూర్యకాంతిలో మరింత తెల్లగా దట్టంగా మేఘంలా కనిపించసాగింది దుమ్ము.పశువుల వెనక 'పేడాకడి'—'పేడాకడీ' అని అరుచుకొంటూ పేడా పళ్ళెకలు చంకన పెట్టుకొని పరిగెత్తుతున్నారు ఆడవాళ్ళు — వాళ్ళల్లో వాళ్ళు పోటీలుపడి అరుచుకొంటూ — పశువుల మధ్యన కలిసిపోయి దుమ్ములో పరుగెత్తుతున్నారు, గొడ్లన్నీ క్రమం తప్పకుండ




ఏకాయా ఉతికితే బట్టలన్నీ మెరయుమెరిసే తెలుపు! నిష్కళంకమైన శుభ్రత! ఇది, మొల్ల ముద్దల కొలది నురగ గల సర్ఫ్ యొక్క, ఉతికే అధిక శక్తి వల్లనే. మీ బట్టలన్నిటి ఉతుకును చాలా సులభం చేస్తుంది. మీ పిల్లల బట్టలు, షర్టులు, చీరలు...ప్రతిదీ అమిత తెల్లగాను, ప్రతిదీ పరిశుభ్రంగాను వుంటుంది. సర్ఫ్‌తో ఇంట్లో ఉతుక్కోండి.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును

కూలీలు చేలి ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు.

వాలూ వంకా లేని వీధులు, అసహ్యంగా దుమ్ము కొట్టుకొన్న పెంకుటిళ్ళు, పాటి మట్టి గోడలు, కొన్ని గోడలకు పిడకలు కొట్టి ఉన్నాయి. ఇళ్ళ ముందే పెంట పోగులు, చెత్త చెదారం, ఎగుడు దిగుడుగా ఉన్న గతుకుల రోడ్లపై విడిచిన బళ్ళు— రోడ్లపై అక్కడక్కడ కోళ్ళు గింజలు ఏరుకు తింటున్నాయి.

వీటన్నిటినీ పరిశీలనగా చూస్తూన్న అతని దృష్టి విచలితమైంది.

బీడునుండి తిరిగొచ్చిన గొడ్లు గేటు ముందు నిలబడ్డాయి. తలలు ఇనుప కమ్ము లకు ఆన్చి కుమ్ముతున్నాయి. వాటిని చూసిన లేగదూడలు చివుక్కున లేచి నిలబడ్డాయి. ఒక్కసారి వెన్ను విరుచుకొని 'అంబా' అని అరుస్తూ మెడ పలుపులు లాక్కుంటు న్నాయి.

'ఒరేయ్, నీరాడు!—ఆ గేటు తీసిరాపో, గొడ్లొచ్చాయ్' దొడ్డి వైపు చూస్తూ అతనన్నాడు.

'పోతా' నిర్లక్ష్యంగా సమాధానమిచ్చాడు జీతగాడు. కుడితి గాబులో చిట్టుపోసి చెయ్యిపెట్టి తిప్పసాగాడు. అది బుర, బుర మని బుడగలు తేలసాగింది. చంక వరకూ మునిగిన చెయ్యి గాబునుంచీ బయటికి తీసి కొని గేటువద్దకెళ్ళాడు. పశువులన్నీ బిల బిల మంటూ గాబు మీద వచ్చి పడ్డాయి. జీతగాడు సన్నగా ఈలవేసికొంటూ వాటి వెన్నుని నిమురసాగాడు.

'నీయమ్మ కడుపు మాడ'... కొష్టంలో నుండి ఆమె కేకలు వినిపించాయి. అతనూ, జీతగాడూ ఇద్దరూ అటు దృష్టి మర లించారు.

'అది కాదురా, నీకు ఎన్నిసార్లు చెప్పాను నెత్తిన నోరు పెట్టుకొని—దాన్ని మేడలో మొకలానికి కట్టేసి పోరా!—కాకులు పొడు స్తాయని...నీ తల పండు పగల...ముదనష్టపు ముండాకొడకా.. అయ్యో!అయ్యో!బొడ్డూడిం దాకా జాగర్తరా...అని చెప్పా. వచ్చి పుండు చేసి ఒదిలిపెట్టినయి కాకులు—కొబ్బరిమాను, ఇంత పసువూ రాసి చావు...' ఆమె జీతగాణ్ణి తిట్టసాగింది లేగదూడకు మూతికి చిక్కం వేయుచూ.

అతను తువాలో నెత్తి పెట్టుకొని తొట్టు

# మట్టి బొమ్మలు

ఉంగరాలు, ఉంగరాలుగా మెలి తిప్పుకొంటూ 'అమ్మా! దానికి చిక్కమెందుకే... నోరు లేనిది...తాగితే మాత్రం ఎన్ని పాలు తాగు తుంది'—అన్నాడు.

'చిక్క మేమిట్రా... అవసరమైతే ముక్కుతాడు కూడ వెయ్యాల్సొస్తుంది. కోడెదూడ కదా' అంది.

అతను మళ్ళీ బజారువైపు చూడసాగాడు.

పగలంతా సాళ్ళు తోలిన ఎడ్లు తిరిగి వస్తున్నాయి. మెడల పైన కాడి, కాడి మధ్యలో నాగలి పన్ను కట్టారు. దాని చివర నేలమీదకు వదిలివెయ్యటాన నేలను గీచుకొంటూ వస్తోంది. అలవాట్పని కోడె దూడ ఒకటి తోకమట్ట పైకెత్తి పట్టు కొని 'రంకె' వేసి నేలను గికి ఓర చూపు చూస్తూ సవాలు చేస్తోంది.

'నాయనా, మధూ!..అలా ఎంతసేపని నిల బడతావురా...'అటు మామయ్యగారింటికైనా పోరాదూ...వచ్చి పదిపదిహేనురోజులైనా అటు కేసి పోకపోతే మామయ్య...మా యింటికన్నా రాలేదనుకోడూ' అని అటుతిరిగి... 'ఒరేయ్ దీనికి గాడిద గరపాకు తెమ్మన్నా తెచ్చావా?... అయితే దీనికి నాలుగాకులు పెట్టు...దీనికి కడుపుపెడ్డట్టుంది' అంది.

అతనిముఖంలో విసుగు కనిపించింది. మొహాన్ని తడి టవలుతో తుడుచుకొని అడ్డగుడ్డపైకి మడుచుకొని గేటువరకూ వెళ్ళాడు. అంతలోనే ఏదో స్ఫురించినట్లు మళ్ళీ తిరిగి లోనికెళ్ళాడు. సబ్బు టవలూ తెచ్చుకొని శుభ్రంగా ముఖం కడుక్కున్నాడు.

సూట్‌కేస్‌తీసి రెండుమూడు జతల బట్టలుతీసి పక్కపై పరిచాడు. మూడు పంట్లాములకూ, మడతలు ఊడదీసి, నడుంవద్దనుండి గిలకలవరకూ వేలాడవేసి కొని చూసికొన్నాడు. రెండింటిని మంచం పైకి గిరాటువేశాడు. షర్ట్‌తీసికొన్నాడు.

బొత్తాములు పెట్టకుండ 'కాలర్' సరి చేసికొని అద్దంలో చూసికొన్నాడు. మెడ అటూ ఇటూ ప్రక్కకు వాల్చుకొని వివిధ భంగిమలలో దాని అందాన్ని పరిశీలించాడు. రెండవ క్షణంలో గాలితోపాటి వంకెకు వేలాడబడింది. రెండవషర్టు విప్పాడు. ముచ్చటగాఉన్నట్టు సంతృప్తితో అతని

ముఖం విప్పారింది. ఈలవేసికొంటూ చేతులు దూర్చాడు. చేతులవద్ద బొత్తాములు పగిలి పోయ్యాయి. ఈలపాట ఆగిపోయింది. మూతి ముడుచుకొని మూడవ చొక్కా అందుకొన్నాడు. 'నో మాచ్' అంటూ మడ తలుకూడ విప్పకుండ దాన్ని జారవిడిచాడు. మళ్ళీ ఆ మొదటచొక్కా అందుకొని 'టకప్'చేసి అద్దంముందు నిలబడ్డాడు. వెనక్కి తిరిగిచూసికొంటూ షర్టుకొద్దిగా పైకిలాగి గుండ్రంగా పంట్లాంపై వాలి పొయ్యేలా అమర్చుకొన్నాడు.

చేతులు జేబుల్లోకి పొయ్యాయి. మళ్ళీ బయటికొచ్చి ఇస్త్రీమడతలు సరిదిద్దాయి. అద్దంలో అతనిముఖం నవ్వింది. ప్రతిబింబం మరింత దగ్గరగా అతని ముందుకొచ్చింది.

'ఛ్'..అద్దాన్ని శుభ్రంగా రుమాలుతో తుడిచాడు.

స్పష్టంగా కాంతి వంతంగా ఉన్న ముఖం. చెయ్యూపి ప్రతిబింబానికి వీడ్కోలు చెప్పాడు. 'టక్'—'టక్'—'టక్' మంటూ నిడలు తేలుతూన్న చలువరాళ్ళపైన అతని బూట్లు శబ్దంచేస్తూంటే ఈలవేసికొంటూ బయటికి నడిచాడు.

'మామయ్యగారింటికేనా ? ... పెద్ద బజారుగుండా వెళ్ళకు దిష్టిబెడతారు... ఇటుపో... ఉప్పునీళ్ళబావి పక్కగా' దొర బాబులా ముద్దుగా ముచ్చటగా అలంకరించు కొన్న కొడుకునిచూసి ఆమె ముచ్చటపడి పోసాగింది.

'దిష్టీలేదు గిష్టీలేదుపో' అంతా పిచ్చి' తల్లిమాటలను లెక్కచెయ్యకుండ గొణు క్కొంటూ ముందుకు వెళ్ళాడు.

'ఒరేయ్...మంచో చెడో...పెద్దదాన్ని. .నే చెప్పేది వినరా...మొన్నకూడ అటటు తిరిగి వచ్చి ఒంట్లోబాగులేదని పండుకొంటివి తిండీ తిప్పలులేకుండ... మా నాయనవుకదా?'... వీధివైపు అరుగుమీద నిలబడి ఆమె పెద్దగా కేకలుపెట్టసాగింది.

అతను ఒకక్షణం ఆగాడు... పొదుగు కుమ్ముతూ పాలుతాగుతూన్నలేగ—దాని శరీ రాన్ని నాకుతోంది ఆవు.

'సరేలే ... ఊళ్ళో ఎవరికీ పిల్లలు లేనట్లు' విసుగుపడుతూ ముందుకు కది లాడు. ఆతల్లిచూపుల్లోనే కదిలి గేటుదాటి అవతలకు నడిచాడు.

ఆ మలుపు తిరిగి పక్క సందులోకి తిరిగాడు.

రచ్చబండమీద వయసు మళ్ళిన పెద్దలు కూర్చున్నారు. చేతికర్రలు బండకాన్చి చుట్టలు కాల్చుకొంటున్నారు.

బజారంతా అసహ్యంగా ఉమ్మివేశారు.

'ఎవరూ ?'

'ఏ వూరూ ?'

'ఎవర్రా... ఆ పిలగాడు... పలక్కుండ పోతాడు.'

'ఏవూరబ్బాయ్ మనది.'

నడక ఆగిపోయింది...'నే నేలే...' క్లుప్తంగా సమాధానమిచ్చి ముందుకు కదలబోయ్యాడు.

'అయ్యా... నువ్వంటరా' ... నొసటికి చెయ్యి అడ్డం పెట్టుకొని ఒక ముసలాడు గుర్తించాడు. 'నిండా నూరేళ్ళ ఆయుస్సు. ఇప్పుడే నీ సంగతనుకొంటున్నాం... ఇంకా బస్తీకిపోలా?...మీ నాయన ఊరికి తల్లో నాలికలాగుండేవాడు. పాపం—మానుభావుడు. సచ్చియాడ సొర్గంలో ఉన్నాడో కానీ... ఆయనపేరు నిలిపాలి...యాడికీటు బయల్దేరావ్. మామగారింటికా!'

జేబుల్లోకి చేతులుపోనిచ్చి తల ఊపాడు 'ఔ'నన్నట్లు.

'అయ్యా—నువ్వు ఎంకట్రామయ్య కొడుకువా?...నిన్ను చిన్నప్పుడు చూశా... ఈ మధ్యన బొత్తిగా సూపుపోయింది. నిన్ను గుర్తుబట్టలేకపోయ్యా'... అంటూ చెయ్యి పట్టుకొని ప్రేమగా చేతిని నిమురసాగాడు జింగారపు మురుగుల ముసలాడు.

ఒక బొప్పబండి అటునుండే రాసాగింది. ఇరుకు సందు ఇళ్ళగోడలకు రాచుకొంటూ వస్తోంది. బండికి దారిస్తూ అక్కడనుండి వాళ్ళు లేచిపోవాల్సిన అగత్యం ఏర్పడింది. దానితో అతనికి విముక్తి లభించినట్లు నిట్టూర్పు విడిచాడు.

'సరే...వస్తా'—అంటూ చేతిని విడిపించుకొన్నాడు.

'పొయ్యిరా నాయనా బస్తీలో పెరిగి నోడివి..పల్లెటూళ్ళో ఉండాలంటే కట్టమే.'

ఆమాటలు వింటూ, వంచిన తల ఎత్తకుండ పరాసరి ముందుకెళ్ళి పొయ్యాడు మధు.

(ఇంకా వుంది)

# త్వరలో ప్రారంభం!

# అధ్యక్షుని మరణం

రచన

## విలియం మాంచెస్టర్

త్వరలోనే ప్రపంచ ఖ్యాతిచెందిన విలియం మాంచెస్టర్ పుస్తకం 'అధ్యక్షుని మరణం' ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకి అందచెయ్యబోతున్నామని తెలుపటానికి సంతోషిస్తున్నాము.

కీ. శే. జాన్. ఎఫ్. కెన్నెడీ హత్య చరిత్రని సమగ్రంగా రాయటానికి శ్రీ మాంచెస్టర్‌ని శ్రీమతి జాక్వెలిన్ కెన్నెడీ, ఆమె కుటుంబంలోని ఇతరులూ నియమించారు. కాని ప్రచురణకి ముందే 'అధ్యక్షుని మరణం' ఎంతో వివాదాస్పదమయిపోయింది!

ఈ వివాదానికి సంబంధించిన వివరాలు పత్రికలలో ఇంతకి ముందే పడ్డాయి.

ఇప్పుడు తెలుగు పాఠకులకి అసలు పుస్తకమే చదివే అవకాశం కలుగబోతున్నది!

—సంపాదకుడు.

# యీ 'బ్రిజిల్' కొనల్ని భూత అద్దము క్రింద పోల్చి చూడండి



# బినాకా
## టూత్ బ్రష్

క్షేమకరమైన 'గుండ్రని బ్రిజిల్' కొనలతో కూడి చిగుళ్లను తెగనీయదు
REG. PAT. NO.

CIBA

**పరిశుభ్రముగా తోమండి**
**క్షేమకరముగా తోమండి**
**బినాకా తో తోమండి**

# వారఫలం

**19-5-1967 శుక్రవారం మొదలు**
**25-5-1967 గురువారం వరకు.**

**మేషం :** వ్యాపారంలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. వారాంతంలో అనుకోని చికాకులు కలుగుతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృషభం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. పోటీ వారితో మాటపట్టింపులకు దిగడం తగదు. సాంఘిక కార్యక్రమాల్లో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మిథునం :** ప్రయత్నించిన పనులకు ఆటంకాలు రావడం అనుకోని పనులు నెరవేరడం వంటి సంఘటనలు జరుగుతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. నూతన వ్యాపారాలు లాభించ గలవు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కర్కాటకం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగావుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. వ్యాపారంలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. కోర్టు వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య :** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. వృత్తిలో ముఖ్యమైన సంభాషణలను జరుపగలరు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలించ గలవు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**తుల :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృశ్చికం :** కొన్ని పనులు సులువుగా నెరవేరినా, మరికొన్నింటిలో శ్రమ పొందవలసి వస్తుంది. ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. వారం ప్రారంభంలో ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో అభివృద్ధిని సాధించగలరు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగావుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :** ఆదాయం మాట యెలాగున్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. బంధులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో ఫలించగలవు. ఉద్యోగంలో గౌరవం బాగావుంటుంది. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగావుంటాయి.

స్త్రీలకు:— శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వారం మధ్యలో మంచి పరిస్థితి యేర్పడుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

**మీనం :** ఫలితం మాట యెలాగవున్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. వారం మధ్యలో అనుకోని చికాకులకు గురి కాగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాల్లో శ్రమ అధికంగా వుంటుంది. ఆందోళన కలుగు తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

—మహేష్






వాకాటి పాండురంగారావ్

# నిప్పు

ఎఱ్ఱటి పూలతో ఒళ్ళు విరుచుకుంది కిటికీబయట కానుగచెట్టు.

కిటికీకి ఇవతల, మేడమీద 'గదిలో ఈజీచేర్‌లో పడుకుని వున్నాడు పద్మనాభం. సాయంకాలపు ఎండలో కానుగచెట్టొక హోమగుండమై వెలుగుతుంటే, ఆ అందాన్ని అనుభవిస్తున్నాడు పద్మనాభం.

ఏడేళ్ళకింద సరిగా ఈ ఆగస్టు తొమ్మిది — పెళ్ళిపీటలమీద తనకూ సీతకూ మధ్యవున్న మధుపర్కాన్ని తొలగించినప్పుడు, తనకన్నులామె వదనంమీద నిలిచినప్పుడు, ఆమె ముఖంమీద కుంకుమ వర్షించ లేదా... ఆ వర్షం గుర్తొచ్చింది ఈ పువ్వుల్ని చూస్తుంటే.

చటుక్కున వెనక్కు తిరిగి చూశాడు.

అయిదారు నిముషాలనుండి ఆ గది' గుమ్మంలో నిల్చుని చూస్తున్న సీత నవ్వింది.

నెమ్మదిగా అడుగులువేసి అతడి ప్రక్కగా కుర్చీని లాక్కుని కూచుంది.

'చాలసేపయిందా?' పద్మనాభం అడిగాడు.

'అబ్బే, ఇపుడే... మీరా కిటికీబయటకు చూస్తుండగా వచ్చా.' అంటూ అతడి నోటికొక బర్ఫీముక్క నందించింది.

'సీతా! ఆ ఎఱ్ఱటిపువ్వుల గుత్తుల్ని చూస్తుంటే వధువు మోహంమీద సిగ్గు వేసిన ముగ్గుల్లా లేవూ.'

'ఊహూ! బొత్తిగాలేవు! ఆన్ ది అదర్ హేండ్ నా ఇంగ్లీష్ ఆన్సర్ పేపర్‌మీద మా రమణయ్య మేష్టారు ఎఱ్ఱపెన్సిలుతో చుట్టిన సున్నల్లా వున్నాయి.'

పద్మనాభం ఫక్కున నవ్వాడు.

సీతా నవ్వింది.

'అయినా అద్దె కొంపలో వుంటూనే పరిసరాలమీద ఇంత మమకారం అయితే...' అనబోయిన సీతకు అడ్డు వచ్చాడు పద్మనాభం.

'ఏం, ఇంకో ఏడాదిలో మన ఇల్లంటూ ఒకటి వుంటుంది లేవోయ్... మా ఆఫీసు సొసైటీ వాళ్ళు ఆ స్థలాన్ని ఈ వారం ఖాయం చేస్తున్నారు. నిన్ననే బ్యాంకినుండి ఆరువేలూ తెచ్చి ఇంటో వుంచాను.'

'ఆరువేలతో అయిందా! 'ఇల్లు కట్టి

చూడు' అన్నారు మరి' అని ఆర్యోక్తిని వల్లించింది ఆర్యపత్ని సీత.

'నమ్మకం లేకపోతే మానేయ్. వచ్చే ఆగస్టునాటికి మన ఇంట్లో మనం వుంటాము. ఆఁ! మరి ఈలోగా అబ్బాయి కూడా అవతరిస్తే!'

ముడివడిన ఆ భ్రుకుటి, కొనుక్కొచ్చుకొన్న ఆ కోపం అతడి మనసున మల్లెలు పూయించాయి.

—'అమ్మా! వాళ్ల రవికీ, ఇంకో బిస్కట్టు కావాలిట' అంటూ వగరుస్తూ వచ్చింది అరుణ.

'ఇటు రా తల్లీ!' అని కూతుర్ని దగ్గరకు తీసుకుని, అలసిపోయిన దాని మొహం మీద చెమటను తుడిచి ముంగురులను సరిదిద్దాడు పద్మనాభం; బుగ్గ మీద ముద్దు పెట్టుకున్నాడు. ఇదేమీ పట్టించుకోకుండానే అరుణ 'అమ్మా! బిస్కట్టివ్వవే, వెళ్లాలి' అంది.

'ఏమిటే ఆ తొందర, ఏదో కొంప అంటుకుపోతున్నట్లు. అయినా ఆ రవిగాడు నీకు ఏదీ ఒక్క పిసరుకూడా ఇవ్వడు గదా వాడికి నువ్వు రోజూ ఓ అరడజను బిస్కట్లు ఎందుకివ్వాలి అంట?' అని ప్రశ్నించింది సీత.

పెద్దవాళ్ల లాజిక్కేమీ అర్థం కాని అరుణ 'ఇవ్వవమ్మా' అంది.

'అంతగా అది అడుగుతుంటే ఇవ్వరాదూ?' దాన్ని కూడా నీలాగే లోభిగా తయారుచేయడం ఎందుకూ?'

కొరకొరమని చూచింది సీత.

ఆరేళ్ళ అరుణకు నాన్న చెప్పిన మాటలన్నీ అర్థం కాలేదు కానీ, ఎప్పుడూ నాన్న తన పక్షమే మాట్లాడుతాడనీ, ఇపుడూ అదే చేశాడనీ తెలిసింది దానికి. వంగి నాన్నచేతిమీద ముద్దు పెట్టుకుంది.

'బాగున్నారు నాన్నాకూతుర్లూ! అక్కడికి మీరు శిబి దధీచులైనట్టూ, నేను పిసినిగొట్టునట్టూ అన్నమాట, ఫరవాలేదు లెండి' అంటూ అలమారనుండి డబ్బాతీసి అరుణ చేతికి బిస్కట్టునిస్తూ ఆర్గ్యుమెంటును సాగించింది సీత 'పోనీ ఒక బిస్కట్ ఫ్యాక్టరీయన్నా పెట్టండి, దారిని పోయేవారందరికీ తలో పేకెట్టూ ఇవ్వవచ్చు...'

బిస్కట్లు తీసుకున్న అరుణ—'అమ్మా! ఇంకొకటివ్వవే—'నీలా'కిస్తాను అంది.

'బాగుంది వరస, కుక్కలక్కూడా బిస్కట్లా' అంది సీత. పద్మనాభం నవ్వాడు.

'అయినా కుక్కలకు ఈ బిస్కట్లు ఏమిటండీ—'నీలా' కిస్తే దాని తల్లికీ, దాని పిల్లలకూ ఇవ్వొద్దూ?' అంటూ మరో మూడు బిస్కట్లు నిచ్చింది సీత. రాణికొకటి, నీలాకొకటి, మణికీ మాలకూ కలిపి ఒకటి—అని చెప్పింది అరుణతో.

గెంతుతూ వెళ్లింది అరుణ.

క్రింద బిర్రుమని చప్పుడయితే, వీధిలోకి తొంగిచూశాడు పద్మనాభం. లారీ ఒకటివచ్చి పక్కింటి ముందర ఆగింది. దాన్నంతా ఫిల్ము నెగెటివులున్న చెక్కపెట్టెలున్నాయి. మెట్లు దిగుతున్న అరుణవైపు చూస్తూ అరిచాడు పద్మనాభం.

'లారీవుంది—జాగ్రత్తగా రోడ్డు దాటి వెళ్లమ్మా' అన్నాడు పక్కింటి వరదరాజులుగారి గురించి ఆలోచిస్తూ. ఆయన వేస్టు ఫిల్ము నెగెటివ్‌లతో సంచులు చేయించి టోకుగా అమ్ముతాడు; ఎగుమతికూడా చేస్తాడు. ఒంటరిప్రాణి. అయితేనేం పదిలక్షలు బొత్తిగా చాలక పదకొండో దానికి పడగలెత్తుతున్నాడు, పాపం!

ఇవేమీ తెలియనిసీత ఆరో తరగతి సామాన్య గణితంలోకి దిగింది— 'అది కాదండీ! రోజుకి ఇరవై బిస్కట్లయితే—నెలకెన్నిపొండ్లు కావాలో చెప్పండి—'

'దానికేం తెలుసు సీతా—అది చిన్నది...'

'ఏం చిన్నదో —'ఇది నావస్తువు, పోతే మళ్లీరాదే—' అని తెలియకుండా పెరిగితే ఎట్లాగండి? ఆఖరుకు తన బొమ్మల్నికూడ అడిగినవారికి ఇచ్చేసి వస్తుంది.. 'వాళ్ళ రమణ—అడిగిందే, ఇచ్చాను' అంటుంది ... ఏంచెయ్యడం దాంతో—'

'అట్లాగే పెరగనియ్యి దాన్ని! వస్తువులు పోతే పోయె ఆ మంచి తనంతోనే అరుణ పెరిగి పెద్దదవ్వాలి. మంచి మనుష్యులు పదిమంది వుంటే బ్రతుకన్నది ఎంతో అందంగా వుంటుంది.'

'మాట్లాడితే చాలు! మంచితనం, సహృదయం, సౌజన్యం అంటూ బయల్దేరుతారుమీరు... రెండు నిముషాలు వింటే ఐక్యరాజ్యసమితితో కూచున్నట్లుంటుంది.'

'అబ్బో, సమితీ గ్రటా అంటున్నావు—దినపత్రిక చదువుతున్నావేమిటే మధ్య!'

'దినపత్రికా? చదవడమా? మాబోటి సామాన్యులా?' అని ఆశ్చర్యం ప్రకటించిందామె.

గలగలమని నవ్వాడు పద్మనాభం.

ఇంతలో వాళ్ళమ్మ గదిలోకి వచ్చింది. సీతలేచి నిల్చుంది. 'ఒరేయ్! కృష్ణారావూ వాళ్ళూ వచ్చార్రా!' అంటూ కోడలివైపుచూచి—' ఈ 'భక్త విజయం' అక్కడ వుంచేసి 'కృష్ణ కర్ణామృతం' అందుకో అమ్మాయ్!' అంది ముసలావిడ.

అత్త అడిగిన పుస్తకం అందించి బయటకు అడుగుపెడుతున్న సీతకు నమస్కరించి, లోపలికి నడచారు కృష్ణారావూ ధనంజయమూ.

'ఏరోయ్! కొత్త పెళ్ళికొడుకులా ఉషారుగా వున్నావూ?'

వెనక గదిలోకి వెళ్తూ ఆమాట విన్న సీత మొహం గుప్పు మన్నది ఎర్రదనంతో.

— ఆ రాత్రి తొమ్మిదింటికి పద్మనాభం భోజనం చేసి చేయి కడుక్కుంటుండగానే మిత్ర బృందం వీధిలోనుండి అరిచింది. ఓడియన్ లో 'బెక్కెట్' చూడాలని కార్యక్రమం సాయంకాలమే పద్మనాభానికి చెప్పివెళ్ళారు. టంచన్‌గా అప్పుడే వాళ్ళల్లా వచ్చేశారు!

వెళ్తూ వెళ్తూ నిద్రపోతున్న అరుణను ముద్దు పెట్టుకున్నాడు పద్మనాభం.

'పన్నెండవుతుందా' అని అడిగింది సీత.

'అవ్వొచ్చు'

'క్రిందివాళ్లు వూళ్లో లేరుకదా—మీరు వీధికి తాళంపెట్టుకు వెళ్ళండి. వచ్చేటప్పుడు బస్ కోసం పడిగాపులు గాయక టాక్సీలో రండి.' అంది సీత

'అట్లాగే!'

'చీకటివేళ! జాగ్రత్తగా వెళ్ళిరారా అబ్బాయ్' అంది పద్మనాభం వాళ్ళమ్మ. నవ్వుకుంటూ వీధిలోకి అడుగుపెట్టాడు. వాళ్ళమ్మ కన్న ఆరుగురు సంతానంలో మిగిలివాడతడొక్కడే.

వీధిలో మిత్రులతోకలిసి పది అడుగులు వేశాక తటాలున వెనక్కు తిరిగాడు పద్మనాభం.

# నిప్పు

కాముగ చెట్టు సీడ పడుతున్నా తాను మేడమీది కిటికీలోనుండి తనవైపు రెండు నక్షత్రాలు చూడడం కన్పించింది. గర్వంగా బాధగా బరువుగా ఏదోగా అనిపించింది. వెనక్కు పారిపోదా మనిపించింది.

'అబ్బ! జనం నవ్వగలరు' అని తన్ను తానే మందలించు కున్నాడు.

ఎందుకో ఒక్కోరోజు హాయిగా, సంతృప్తిగా, నిండుగా వుంటుంది. అంత ఎత్తులోనే లోతుగా భయంవేస్తుంది. ఇదంతా ఇట్లాగే వుంటుందా—నిజంగా వుండగలదా అన్పిస్తుంది. అదొక అరక్షణమే!

ఆ నిండుదనమూ, ఆ సంశయమూ ఇవాళ తనతో చేతులు కలిపాయి.

మధ్యాహ్నం వచ్చి వాళ్ళిద్దరూ బల వంతం చేశారు కాబట్టి తాను పూట సినిమాకు వెళ్తున్నాడు గాని లేపోతే— ఇంట్లోనే ఉండిపోయేవాడు.

అరుణ పెద్దదయింతర్వాత వైద్యమా, పాట్యమా ఏది నేర్చుకోవాలి అన్నదానిని గురించి, దాని పెళ్ళిగురించి, తాము కట్టబోయే ఇంటిలో ఏర్పరచవలసిన సౌకర్యాలగురించి. తోటలో వేయవలసిన మొక్కలగురించి, ఒకానొకనాడు రైల్లో ఒకరినొకరు చూచుకుని తలిదండ్రుల ద్వారా తాము వివాహాన్ని ఎట్లా సాధించారో అన్నదాన్నిగురించి— మాట్లాడుకునేవారు తనూ సీతా.

లేకపోతే చదరంగం ఆడుకునేవారు.

లేకపోతే అమ్మ తన చిన్నప్పటి కబుర్లు, బంధువులతో కోర్టుకేసులు— చెబుతుంటే వినేవారు.

'ఓరబ్బి బంగారుసామీ! ఆ బెంగంతా నీ ఆవిడకోసమే?' అన్న ధనంజయం గొంతు పద్మనాభాన్ని బస్‌స్టాండ్‌లోకి లాక్కు వచ్చింది.

'బెకెట్' చూశారు హాలునుండి బయటకు వచ్చారు.

'రిచర్డ్ బర్టన్ అద్భుతంగా నటించా' డని కృష్ణారావ్ గోలపెడితే, 'కాదు! పీటర్ ఓటూలే ఆకాశాన్ని అందుకున్నాడ'ని ధనంజయం ఢంకా బజాయించాడు.

పద్మనాభం తన ఓటు ఎవరికీ వెయ్యలేదు.

నిండయిన తన ఆ దినానికి ఆ సినిమా ఒక చక్కటి ముగింపులా వుంది అను కున్నాడు. దాన్ని గురించి మాట్లాడడం అతడి కిష్టం లేదు.

అతడు ఆరో నెంబర్ బస్సెక్కాడు. వాళ్లిద్దరూ మరో బస్సెక్కారు.

బజార్ దగ్గర బస్ దిగాడు పద్మనాభం.

చల్లగా వేగంగా వీస్తోంది గాలి. చొక్కా కాలర్ బటన్ వేసుకుని, గబ గబ నడవసాగాడు పద్మనాభం.

ఖర్చులకు చాలని జీతం రూపాయలులా, చీకటికి చాలని దీపాలు వీధి కిటూ అటూగా పహరా కాస్తున్నాయి.

తోక తెగిన కుక్క ఒక్కటి పద్మ నాభాన్ని చూచి మొరిగింది. అతడు తన దారిన తాను పోవడం చూచి విసుగెత్తి వూరుకుంది.

సరస్వతీహాల్ దాటి పెద్దవీధిలోకి వచ్చాడు. ఈలవేసు కుంటూ వెళ్లాడొక సైకిల్ రిక్షా వాడు. ఇంకో ఫర్లాంగులో వుంది ఇల్లు.

ఈపాటికి సీత కూడా మంచి నిద్రలో వుంటుంది.

—అమ్మ పెద్దదయింది, ఒక్కోరోజయితే ఏ రెండు గంటలకోగాని నిద్రపోదు.

వాచీ చూచుకున్నాడు పద్మనాభం. పన్నెండూ ఇరవై అయింది.

మలుపు తిరిగి, తన వీధిలోకి అడుగు పెట్టిన పద్మనాభానికి—

రాత్రిలో నుండి పగటిలోకి నడిచి నట్లయింది.

తల్లి గర్భంలోనుండి ప్రపంచంలోకి పడ్డ ట్లయింది.

వీధి వీధంతా ఎర్రటి వెలుగుతో, ముక్కును చీలుస్తున్నట్లు పెచ్చటి వాసనతో బిల బిల లాడుతూంది.

వేడిగా వెలుగు, తెల్లగా పొగ, పెద్దగా అరుపులు, తెరిచిన తలుపులు, చూస్తూ, అరుస్తూ, నిలుస్తూ, పరుగెడుతూ, ఇంకా ఏదేదో చేస్తూ మనుషులు— ఏదో ఎర్రటిబిండ్లు— లారీలవంటిబండ్లు— బండ్లవంటిలారీలు—

'ఏమిటిదంతా?' అని గట్టిగా అరిచాడు పద్మనాభం.

ఎవరికీ వినపడలేదు ఆప్రశ్న.

ప్రశ్నకాదది—పదివేల బాంబులు ఎదలో పేలిన శబ్దం అది.

పరుగెత్తాడు పద్మనాభం ఎవరో ఆపారు.

సురాసురులెవరో కోలాహలంగా దీపావళ పండగ చేసుకుంటున్నట్లు—శివుడి మూడవ కన్ను తెరుచుకున్నట్లు— నియత్నాం ఎగిరి వచ్చి ఆవీధిలోపడ్డట్లు—ఆకలితో కడుపు కాలినట్లు— మానభంగంతో శీలం గింజా కున్నట్లు — మహాచిత్రకారు డెవరో అతి మనోహరమూ మహోగ్రకారమూ అయిన



## రోజంతా హాయిగా, తాజాగా ఉండుటకు...



# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్‌ను కుటుంబములో పిన్నా పెద్దా అందరూ రాసుకోవచ్చును. హాయి నిచ్చే, సేదదేర్చే యీ పౌడరు మెత్తగా ఉంటుంది, ఉపశమనము కలిగిస్తుంది. చెమటను త్వరగా పీలుస్తుంది. ఇది మండే ఎండలలో, ఉక్కబోసే వాతావరణములో వాడుటకు దివ్యముగా ఉంటుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్‌ను వాడి తేలికైన పరిమళముతో రోజంతా తాజాగా ఉండండి!




అందరికీ అందుబాటైన,
తేలిక పరిమళముగల
టాల్కం పౌడరు

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

నే(త్రాన్ని తెరుస్తున్నట్లు— ప్రళయకాలాగ్నీ, దినసూర్యులు రెండూ కలిసి విందు చేసుకుంటున్నట్లు— రక్తమాంసాలు భక్షిస్తున్న రాక్షసుడు నవ్వుతున్నట్లు—మండుతూంది.

—నీవే తప్ప నితఃపరం బెరుగనంటూ భక్తుడు పైకెత్తిన చేతులవలె మంటల నాలుకలు ఆకాశంలోకి లేస్తున్నాయి.

ఏనుగుతొండాలవంటి రబ్బరు గొట్టాల్లోంచి నీళ్లు ఉత్సాహంతో ఎగిరివెళ్లి నిప్పుతో పడిపోతున్నాయి.

ఎక్కడో మూల్గులు; ఏవో—అరుపులు.

నిప్పు— మంట— నీరు — పొగ వీటి దొగుడుమూతల మధ్య' వెలుగయిదుఇళ్లు— మరొకలోకానికి చెందినవాటిలా —దివ్య తేజంతో వెలుగుతున్నాయి.

ఆమధ్యది తనఇల్లు—తాను, పద్మనాభం వుంటుండే ఇల్లు, వుండిన ఇల్లు.

ఎక్కడ, అరుణ ఎక్కడ?

సీత ఏది? అమ్మ ఏమయింది?

ఈ నిప్పు—ఈ ప్రళయం —ఈ దావానలం —ఎవరు పిలిచారు దీనిని?

వాళ్లు—వాళ్లు ఏరీ? లోపల వుండడానికి వీలులేదు. ఉండరాదు. ఉండి ఉండరు.

'మొదట ఆ పెట్రోలు యార్డుకు నిప్పంటుకున్నదంట — టాంకులు పేలగా ఆ పెట్రోలు వర్షంలో తడిశాయి ఈ ఇళ్ళు అంతా, ఈ వరస వరసంతా నిముషంలో భగ్గుమని అంటుకుంది. అందులో, ఇదిగో ఇవతల ఆ రెండస్తుల ఇల్లుంది చూశారా, దాన్నిండా ఫిల్ము నెగెటివ్‌లే !! పెట్రోలు, ఫిల్మూ—ఇంతకన్నా అగ్నిదేవుడికి ఏం కావాలి చెప్పండి.' ఎవరో ఒక బుర్రమీసాల జ్ఞాని చాలమంది అజ్ఞానులకు కథాక్రమాన్ని వివరిస్తున్నారు... 'ఇళ్లల్లోని వాళ్లు నిద్రమేల్కొని బయటికి రావడానికి కూడా అవకాశం లేకపోయిందట!' అన్నాడింకోఆయన.

ఎవరో కేకపెట్టారు.

పిడుగుపడ్డట్లు పడిందొక ఇల్లు.

అది ఆకొనసున్న ఇల్లు—దానిపక్కది తనఇల్లు—తన ఇంటికి తాను సురక్షితంగా విడులీవర్నున్న తాళం కప్పవేసుకుని మరీ వెళ్లాడు. పద్మనాభం గుండెలో పలికినవి డైనమైట్లు.



# నిప్పు

పరుగెత్తాడు పద్మనాభం. పరుగెత్తాడు నిప్పులోకి.

ఇద్దరు కాకీ చొక్కాలవాళ్లు పట్టుకు ఆపారు.

ఒక్కఊపుతో వాళ్లని విదిలించుకుని పడ్డాడు నిప్పుల్లోకి ఎట్లా వెళ్లాడో ఏమో ఆ మంటలలో తన ఇంటిని సమీపించాడు. తలుపులు రెండూకాలి ఎర్రగా నవ్వుతున్నాయి. కానుగచెట్టుకి అగ్ని పర్వతంగా కాలుతూంది.

బయటనుండి హోరుమంటూ చప్పుడు. బావురుమంటూ కేకలు. ఆ నిశిరాత్రివేళ ఎక్కడచూచినా ఎర్రటి పగలు !

పద్మనాభం లోపలికి దూకాడు.

బట్టలు కాలుతున్నట్లున్నాయి.

లోపల అంతా మంటలే. ఎత్తుమంటలు, పొట్టిమంటలు, ఎర్రమంటలు, పసుపు మంటలు, తెల్లమంటలు.

వీటిలో ఏ మంట ఒకప్పటిగది?

ఏ మంట వరండా?

మెట్లున్నవి మండుతుంటే ఎట్లా వుంటాయి?

ముంగిలిప్రక్కగా గోడ పడిపోయివుంది.

దానిమీదకెక్కి, వేలాడుతున్న గొట్టాన్ని దేన్నో పట్టుకున్నాడు. చేతులు కాలాయి. కాని వదలలేదు.

మేడవరండా గోడ క్రిందిభాగం అందింది. పైకి పాకాడు పద్మనాభం.

ఇది మేడ—ఇది వరండా... ఇక్కడ అమ్మ వుండాలి. ఆ ముందు గదిలో సీత, అరుణ వుండాలి.

అదేమిటి ఆ మూల పడివున్నది— కుక్క కదూ ? అవును...'నీలా'నా ? రాణీయా? ఎముకలకు, బూడిదకు పేర్లేమిటి ?

ఫెళఫెళ మంది—పక్కిల్లుకాదు. ఈ ఇల్లే ! ముందు భాగం కూలింది. కానుగ చెట్టు కూలి మసి అయింది.

తలుపులు తోసుకుని జన సందోహం కోటలోకి వచ్చినట్లుగా భగ్గుమని మంట లోపలికి వచ్చింది. చిటపటలాడుతూ చిన్నగా పెద్దగా మండుతున్న తలుపులు, దూలాలు, కిటికీలు, పత్రికలు. పెళ్ళలు—అన్నీకూడా తమ నాథుడు, తమ ప్రియుడు, తమగురువు తమ ప్రాణము అయిన ఆ మంట పై ఆనందంతో చేతులు జాచాయి.

వెనకగది గడప దగ్గర పడిపోయివున్న అమ్మ కనపడింది. పరుగెత్తిపోయి పడ్డట్లుంది ఆమె.

మెట్ల వేపు కుళాయి ముందర బోర్లా పడివుంది సీత! ప్రక్కనే అరుణ. వీళ్ళని పడవేసింది నిప్పుకాదు; అంతకన్న భయంకరమైనది—భయం !

అమ్మ—సీత—అరుణ—అన్నీ తానే !

నిన్న—నేడు—రేపు—మూడూ తనవే !

— ఇంకొన్ని నిముషాలు నిలవదీ భవనం. ముత్తయ్య మొదలియారు జనులకు అప్పులిచ్చి, ఆ జనులను పిండివడ్డీ వసూలు చేసి, వారి ప్రాణాలు ఇటుకలుగా, వారి కన్నీళ్ళు సిమెంటుగా కట్టిన ఈ గట్టిఇల్లు కూలబోతున్నది.

ఇంటికన్న ముందు తానుకూలడం తథ్యం.

తను—పద్మనాభం అనే మనిషి రేపు ఇంకో సంవత్సరం లోగా స్వీయార్జితంతో ఇల్లుకట్టి, దానిముందర కానుగ చెట్లు నాటి, వాటి పూవుల ఎర్రటి అందాన్ని చూచి మురిసి పోవలసిన వాడు, సీత చెక్కిళ్ళపైది సిగ్గరుపుతో తన ఆనందాన్ని కొలుచుకో దలచినవాడు, అరుణ జీవితంతో తన జీవితపు ఎక్స్‌టెన్షన్ చూచుకుని చిరంజీవిలా నవ్వవలసినవాడు, కొడుకుని కోడల్ని మనవరాల్ని చూసి మురిసి పోయే ముసలితల్లి ఆనందపు పన్నీటి జల్లులో హరివిల్లులు లెక్కించవలసిన వాడు—

ఆ పద్మనాభం—నేడు—ఇప్పుడు
ఎర్రటి వెలుతురు మధ్య,
నిప్పు కప్పల నాలుకల చివర నిలబడ్డాడు.
అమ్మ!—తన్ను కన్న తల్లి.
తనలో సగం సీత.
—తమ ఇంటి వెలుగు—అరుణ.

ఇల్లంతా కంపించినట్లయింది.

తీసుకుని బయట పడాలి ఎవరిని? ఎవరిని? ఎవరిని? ఎవరో ఒకరినే! అయితే ఎవరిని?

ప్రాణమిచ్చిన అమ్మనా? ప్రాణంలో సగం సీతనా? తను ప్రాణంపోసిన అరుణనా?

'ఎవరిని? ఎవరిని? ఎవరిని? ఆయి? ఎవరిని? ఎవరిని? ఎవరిని?' అని పాడుతూ సంతోషంతో నర్తిస్తున్నాయి నిప్పురవ్వలు,

భామ్మని పేలింది వెనకవైపు దూలం.

పద్మనాభం పిలిచాడు: 'అమ్మా! అరుణా! సీతా! జవాబుగా మూలిగా రేమో! అమ్మ దగ్గరకు వెళ్ళి ముక్కు దగ్గర వేలు పెట్టాడు. అంత వేడిలోనూ మనిషి ఊపిరి వెచ్చగా పీల్చింది. పరుగెత్తి, సీతను కదిలించాడు. ఆమె పెదవులేవో కదిలాయి. అరుణను లేపి కూచోపెడితే అది కళ్ళు తెరిచింది; అక్కడ ఎర్రటి భయం తప్ప మరోటి లేదు.

తన విజయానికి తృప్తి పడి నిప్పు నవ్వింది కాబోలు. ఇల్లు కదల సాగింది. మండుతున్న కర్ర ఒకటి పద్మనాభం ప్రక్కగా పడింది. దానిని ఒక్క తన్ను తన్నాడు. చూస్తూండగా వరండా గోడ పడిపోవడం మొదలయింది. ఆ ఊపుకు తాను క్రింద పడ్డాడు.

అతడి కళ్ళల్లో ఆశ వచ్చింది.

ఆఖరుసారిగా శక్తినంతా కూడగట్టుకుని లేచాడు.

రెండు చేతులకు అడ్డంగా వేసుకుని అడుగులు వేశాడు. ఇంటి వెనక వేపుకు నడిచాడు. తూలి పడబోయి, అతి కష్టం మీద నిలవగలిగాడు. నెమ్మదిగా పగిలిన వంటింటి గోడ కివతల పడిపోయిన పక్కింటి వైపుగా నిలిచాడు.

ఆరుతున్న మంటలు, మెరుస్తున్న టోపీలు, నల్లటి మొహాలు.

ఎవరో అరిచారు.

క్రిందికి దూకాడు పద్మనాభం.

ఎవరో ఎవరినో లాక్కుపోతున్నట్లు, అయినా ఆ విషయం తనకు తెలిసినట్లు ఆ ఎవరో తనే అయినట్లు, అయినా తాను కానట్లు అనిపించింది పద్మనాభానికి

తలదగ్గర బాంబు పేలినట్లయింది.

అతడి ఇల్లు కూలింది.

*　　　*　　　*

ఆరు రోజుల తర్వాత ఒక ఉదయాన ఆస్పత్రిలో కళ్ళు తెరిచిన పద్మనాభాన్ని సిస్టర్ శాంత చిరునవ్వు పలకరించింది.

'హమ్మయ్య!' అంది శాంత.

ఆమెను తదేకంగా చూశాడు పద్మనాభం. అతడి ఒళ్ళంతా మేకులు దిగగొట్టినట్లుంది. తానొక మండుతున్న అగ్గిపెట్టె అనిపించింది పద్మనాభానికి.

'మీ అమ్మాయి బాగుంది!' అంది శాంత.

పద్మనాభం ఏదో అడిగాడు; కాని అతడి పెదవులనుండి మాటేదీ బయటకు రాలేదు.

'ఇపుడేమీ మాట్లాడకండి.' అంది శాంత. కళ్ళుమూసుకున్నాడు పద్మనాభం.

సాయంకాలం కళ్ళు తెరిచినప్పుడు కనపడ్డ డాక్టరునడిగాడు 'సీత, అమ్మ ఎక్కడ?'

డాక్టరు ఏమీ పలకలేదు. పద్మనాభం కళ్ళు మూసుకున్నాడు. డాక్టరు నెమ్మదిగా అతడి కన్నీళ్లను తుడిచాడు.

మరునాటిరోజు సాయంత్రం పద్మనాభాన్ని చూడడానికి ధనంజయమూ కృష్ణారావూ వచ్చారు.

చాలసేపు వాళ్లని చూశాడు పద్మనాభం. వాళ్ళేమీ మాట్లాడలేదు.

చివరకు ధనంజయం చెప్పాడు 'ఆ అయిదు ఇళ్ళూ నాశనమయ్యాయిట.'

కృష్ణారావ్ చెప్పాడు— 'మీ ఇంటి కుక్క పిల్లలు మణి, మాల క్షేమంగా వున్నాయి. వాటిని వాళ్ళమ్మ నీలా నోట్లో కరుచుకుని బయటికి తెచ్చిందిట ఆరోజు!'

అయితే ఆ చచ్చిపోయినది ముసలికుక్క రాణి అన్నమాట అనుకున్నాడు పద్మనాభం.

నీలా కూడా తనపిల్లలను రక్షించుకుంది. అమ్మను, పెద్దదానిని, పెంచినదానిని మరిచిపోయింది.

మరి తానో?

తాను కూడా అంతే!

ఏ ప్రాణికయినా జీవితంలో ఒక్క అమ్మే వుంటుంది.

ఆ అమ్మను వదులుకున్నాడు తాను.

తనలో ఒకభాగం ఆ జ్వాలలో ఒక కింగా అయింది.

— మరునాటిరోజు ఉదయం, అందరి జీవితాలూ క్రొత్తగా చిగుళ్ళు తొడుగుతున్న వేళ శాంత వచ్చింది పద్మనాభం గదిలోకి.

'రేపు పొద్దున్న మీ అమ్మాయిని మీవాళ్ళు చూడవచ్చుండోయ్' — అంది గలగలలాడుతూ.

పద్మనాభం కళ్ళు అపుడే శాంత సర్దిన ఫ్లవర్‌వాజ్ మీదకు వెళ్లాయి.

అక్కడొక గులాబీమొగ్గ — 'రేపు అన్నది నాది' — అంటూ నవ్వింది ఎర్రగా. ●



మగవాళ్లంత ఎక్కువగా ఆడవాళ్లు జూదమాడరా?

# జూదంలోని రహస్యం

ఖాళీ దొరికినప్పుడల్లా జూదం గురించి ఆలోచించడం కొందరి పద్ధతి. వాళ్ల దృష్టిలో అదృష్టదేవత అంటే దేవలం లక్ష్మీకటాక్షం!

మరి కొందరికి జూదం నిత్యవృత్తి. అది వారికి తప్పనిసరి పని. కాని ఏ ఒక్క సారి పూర్తి సంతృప్తి నివ్వదు. పగలూ రాత్రీ కష్టపడ్డం, మోహం వేలాడేసుకోవడమే తటస్థిస్తుంది. వారు రూరుకోరు, మళ్లీ మళ్లీ ఆడతారు. గెలుపు వారికి ఎండమావిలా కనిపించినంత కాలమూ ఆడతారు. ఉన్నది కాస్తా హరీ అంది కదా, ఇక చక్కబడదాం అనే జ్ఞానం వారికి ఆమడదూరంలో వుంటుంది. ఈసారి గెలుపు మనదే అనే ధీమా వారిని పురికొల్పుతుంది సర్వమంగళమయినా ఆశ మినుకు మినుకుమంటూనే వుంటుంది. ఈ నిరంతర విదానంలో భార్యా పిల్లలు నాశనమైపోతారు కుటుంబాలు కూలిపోతాయి.

జూదమాడడానికి బలవత్తరమైన కారణం ఏమిటి? ఈ దుర్వ్యసనానికి పుంగొల్పేది ఏమిటి?అని తీవ్రమైన పరిశోధన చేశారు మానసిక శాస్త్రజ్ఞులు. ఏ ఉద్దేశం మీద జూదం ఆడుతున్నారో, ఏ లక్ష్యాన్ని ఏర్పరచుకుని వ్యసనానికి లోబడుతున్నారో ఆ ఉద్దేశం ఎన్నటికీ ఫలించదు, అని మానసిక శాస్త్రజ్ఞుల్లో చాలవరకు ఏకీభవించారు.

జూదానికి లోబడినవాడు చాలా ఉత్సాహంగాను, చురుకుగాను, మనుష్యుల్లో కలిసిపోయేవాడుగాను, తెలివైనవాడుగాను ఉంటాడని చాలామంది నమ్మకం. జూదరి ఒక్కోసారి స్వార్థపరుడు గాను, దూకుడుగాను వ్యవహరిస్తూ వుంటాడు. అతనిలో సామ బూతికూడా ఎక్కువగానే వుంటుంది. అతిథి అభ్యాగతి లక్షణాల్ని పాటిస్తాడు, తప్పుల్ని కప్పిపుచ్చుకునే దానికంటె అసలు లెక్కచేయనివాడుగానే వుంటాడు, అని మానసిక శాస్త్రవేత్తల అభిప్రాయం.

**చితికిన బ్రతుకులు**

'వృత్తిలో భంగపడడంగాని, కుటుంబ వ్యవహారాల్లో విచ్ఛిత్తి ఏర్పడడంగానీ, లేదా కాముక జీవితంలో అసంతృప్తి ఏర్పడడంగాని ఒకవ్యక్తిని జూదరిగా మారుస్తుంది,' అని కాలిఫోర్నియా యూనివర్సిటీకి చెందిన డా॥ రోనాల్డ్ ఎ. రోస్టైన్ అన్నారు.

'సంఘం తనమీద విరుచుకుపడుతున్న విధానాన్ని చూసి ఏవగించుకున్నవాడు, దాని మీద కసి తీర్చుకోవాలని చూస్తాడు. విరుద్ధ చర్యలను ప్రారంభిస్తాడు. జూదం ద్వారా మానసిక క్షోభను అణచుకుంటాడు.' అనేది డా. రోస్టైన్ వాదం.

'ఈ విరుద్ధచర్యల వెనుక తప్పు చేస్తున్నామనే భావనకూడా గట్టిగా నాటుకుని వుంటుంది.

పోగొట్టుకోవడంద్వారా అతనినేరం అతనికి కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది, అయినా ఆగడు. సంఘంమీద కసి మరింత ఉధృతమవుతుంది. అంతగాను అతను వ్యక్తిత్వాన్ని చంపేసుకొని పతనమవుతూ వుంటాడు. అలా పతనమయ్యేకొద్దీ అతనిలో ఒకరకమైన సంతృప్తి కలుగుతూ వుంటుందని' డా. రోస్టైన్ అన్నారు.

కొందరు వృత్తిగతమైన జూదగాళ్లున్నారు. వారు డా. రోస్టైన్‌తో ఏకీభవించారు.

'పోగొట్టుకోవడం ఎక్కువవడం ద్వారా జూదగాళ్లుకూడా పెరిగి పోతున్నారని' ప్రముఖ జూదగాడు జాన్‌స్కార్నె అన్నారు.

ఈ జూదం ఆడవాళ్లను కూడా వరించడం కద్దు. కాని, వారు మగవారికంటె కొంచెం అదుపులో ఉంటారు. ఎలాగైనా వారిలో నిగ్రహశక్తి ఎక్కువ! వాళ్లలో హెచ్చరిక అనేది ఆదినుంచే వుంటుందని, హద్దులుదాటి వెళ్లడానికి వాళ్లమనస్సు అంగీకరించదని శాన్‌ఫ్రాన్సిస్కో శాస్త్రవేత్త డా. నార్మన్‌కాస్ అన్నారు.

6, 8, 10 ఏళ్ల వయసుగల బాలబాలికలనుకూడా పరీక్షించిన డా. కాస్ ఒకనిర్ధారణకు వచ్చారు.

జూదానికి సంబంధించిన ఒక మిషను ప్రతిసారీ గెలుపునిస్తుంది. మరోమిషను ప్రతి మూడోసారి గెలుపునిస్తుంది. ఇంకొక మిషను ఎనిమిదవసారి గెలిపిస్తూ మొదటి రెంటికన్నా ఎక్కువ ప్రతిఫలాన్ని ముట్టజెబుతుంది. పిండికొద్దీ రొట్టె. వయసు నిమిత్తంలేకుండా జూదమాడడం జరుగుతూ వుంటుంది. కాని, స్త్రీపురుష భేదాలు మాత్రం జూదాన్ని వ్యక్తీకరిస్తాయి. బాలికలు 'భద్రత' దగ్గరగావుండే జూదపు యంత్రాల వద్ద గుమిగూడితే, బాలురు తెగింపుతో అపాయకరమైన జూదపు యంత్రాలవద్ద చేరడం సహజంగా జరుగుతూ వుంటుంది!

—ఇన్‌ఫా



■ 'అనూ!'

'ఊఁ.'

'అతను వచ్చాడు.'

'ఎవరూ?'

'రవీంద్ర.'

అనూరాధ హృదయవీణాతంత్రులు శృతి చేసుకున్నాయి. 'నిజంగా!'

'నిజమే! కాని, జాగ్రత్తగా మాట్లాడు. నాకేదో భయంగా వుంది.'

'నీవిక్కడే వుండు వదినా! భయమంటే నాకు భయం లేదు.'

మందగమనంతో రవీంద్ర కూర్చున్న గదిలోకి అడుగుపెట్టింది అనూరాధ. ఆమె ఆశించినట్లు అతని చూపులు ఆమెకోసం నిరీక్షించటంలేదు.

గాఢంగా నిట్టూర్చింది. 'ఇన్నాళ్లకు మీకు దయగల్గినందుకు కృతజ్ఞురాల్ని... మీరు వెనకటిలా గట్టిగా చెప్పనక్కర్లేదు.'

ఆమె వైపొక చూపు చూసి తల వంచుకున్నాడు రవీంద్ర. ఆమె చెవిలో హియరింగ్ ఎయిడ్ వుంది.

'అన్నయ్య కొన్నాడు. ఇప్పుడు దీని సహాయంతో వినగల్గుతున్నాను.'

ఆమె వైపొక చూపు చూసి తల వంచుకున్నాడు రవీంద్ర. 'క్షమించు. ఆత్మవంచన చేసుకోలేక ఇన్నాళ్ళు ఆగాను. ఇకపై నా బాధ నీకుండదు. దీనిపై సంతకం పెట్టు!'

ఆమె తెల్లబోయింది. 'ఏమిటిది?'

'నేను చెప్పలేను. నువ్వే చూడు.'

వణికే చేతులతో ఆమె ఆ కాగితాన్ని అందుకుంది. రెండు వాక్యాలు చదివేసరికి అంతా అర్థమయింది. నిస్సత్తువ క్రుంగదీసింది. పగిలే గుండెల్ని చిక్కబట్టుకుంటూ మునిపంటితో వణికే పెదవుల్ని నొక్కిపెట్టింది.

'ఈ బంధాన్ని ఎందుకు త్రెంచుకోవాలనుకుంటున్నారు?'

'నీకు తెలియదా? నా నోటితో ఎందుకు చెప్పించాలని చూస్తావు?'

'నా రూపం మారిపోతే నా మనస్సు కూడ మారిపోయిందనా మీ ఉద్దేశ్యం!'

'కాదు. అలా అయితే నా బాధ అర్థం చేసుకుంటావన్న ఆశతో వచ్చేవాడనే కాదు.'

'నాకామాత్రపు విలువ ఇచ్చినందుకు కృతజ్ఞురాల్ని. ఒక్క సంతకంతో మీకీ బంధం తెగిపోవచ్చు. కాని, ఇన్నాళ్ళు మిమ్మల్నే ఆరాధిస్తూ, మీమీదే ఆశలు పెంచుకున్న నేనెలా త్రెంచుకోగలను? వివాహాలు స్వర్గంలోనే నిశ్చయింపబడతాయన్న సనాతన సిద్ధాంతాన్ని జీర్ణించుకున్న దాన్ని నేను. ఈ బంధంలోని అనుబంధాన్ని నమ్మలేని నాగరికురాల్ని కాదు. నాకిది సాధ్యం కాదు...' ఆమె కంఠం గాద్గదికమైంది.

'చదువుకున్న దానివి...'

'అవును. ఇప్పుడెందుకు చదువుకున్నానా అని బాధ పడుతున్నాను.'

'నేను పైకిరావటం నీ కిష్టంలేదా?'

ఒక్కక్షణం ఆగి, 'మీదారికి ఎప్పుడూ అడ్డురాను.' అంది అనూరాధ.

'అయితే...'

ఆమె ఒక్కక్షణంకూడ ఆగలేదు. వెంటనే ఆ కాగితంపై సంతకం చేసింది. అది తీసుకొని అతను లేవబోయాడు.

'ఒక్కమాట. ఈ సంతకంతో మీరు నాతోటి బంధాన్ని త్రెంచుకున్నారు. కాని, మీ చేతుల్తో కట్టిన ఈ మంగళసూత్రం ఇంకా మీరు నావారేనని గుర్తుచేస్తోంది. అదికూడ మీచేతుల్తోనే తీసివేసి నన్ను దూరం చేసుకోండి..., అంతవరకు ఉగ్గబట్టుకున్న అనూరాధకు దుఃఖం పొంగి వచ్చింది.

నిర్ఘాంత పోయాడు రవీంద్ర. ఒక్కక్షణం ఏమీమాట్లాడలేదతనికి. 'అది...నువ్వే... తీసేసుకో!'

'ఒక్కమాట వినిపోండి. మీ భవిష్యత్తును ఉజ్వలపరిచే 'అనూ' చచ్చిపోయినా మీ క్షేమంకోసం పరితపించే 'రాధ' ఎప్పుడూ జీవించే వుంటుంది. మీ ఆనందంలో కాకపోయినా కష్టంలోనయినా నేను గుర్తుకు రాకపోను. శలవు!'

రవీంద్ర అడుగుల చప్పుడు దూరం కాగానే పక్కవీధి వాలి గుండెలు పగిలేలా ఏడ్చింది అనూరాధ. చాటునుంచి అంతా విన్న కమలకి ఆమెను పలకరించి ఓదార్చే ధైర్యం లేక పోయింది!

* * *

'అనూ ఏడుస్తున్నావా?' వాసు లోపలికి వచ్చాడు.

'ఉహూ! లేదన్నయ్యా! కంట్లో నలక పడితే...'

'నీ గుండెల్లోపడిన రాయికంటె పెద్దది కాదు. కంట్లోని నలకకంటె మనస్సులోని వలతను ముందు తొలగించాలమ్మా!'

'ఈ చీకటిలో తేటగా కనిపించే ఈ వెలుగు ఎంత బాగుందో చూడు.'

'ఎందుకిలా మాట మారుస్తావు? వదిన అంతా చెప్పింది నాకు. పైపై మెరుగులకి విలువ నిచ్చేవాళ్ళకి హృదయముండదు. హృదయంలేని అతనూ ఓ. అర్థిస్తేనా!'

ఒకరి దురదృష్టానికి వేరొకరిని నిందించట మెందుకు? ఎవరి ఆనందాన్ని వారు అన్వేషించు కోవటంలో తప్పేముంది?'

'అయితే, మొత్తం చీకటినే పారదోలి వెలుగు తెచ్చుకోక చీకటిలో వెలుగు చూద్దామని ఎందుకు ప్రయత్నిస్తున్నావు?'

'అంత మిరిమిట్లు గొలిపే వెలుగు మీద నమ్మకం లేకనే! ఎప్పటికయినా సత్యమయినది—నిర్మలమైనది ఈ చీకటిలో తేటగా కనిపించే వెలుగు నక్షత్రమే!'

'ఇంత చిన్నవయసులో నీవింత బరువుగా మాట్లాడటం నేను భరించలేను. ఇప్పుడో లక్షాధికారి కూతురితో స్నేహం చేసుకున్నాడు రవి. అతనికి కావల్సింది ఆమె అందం. అంతకు పదిరెట్లు సౌందర్యంతో వెలిగిన పెళ్ళినాటి అనూరాధను అతను మర్చిపోయాడు. ఇటువంటి చపలచిత్తుడిని కట్టుకోవటం నీ దురదృష్టం. రాజశేఖరం గారికి నాన్న ఇచ్చిన మాటకోసం—ఆయన ఆత్మశాంతికోసం ఈ పెళ్ళి నాచేతులమీద జరిపించాను. అందుకప్పుడు ఎంత ఆనందించానో—ఇప్పుడు ఉంచెలంచెలమీద నీ జీవితంలో ముంచుకొచ్చిన కష్టాలకు అంత బాధ పడుతున్నాను. ఏమయినా నువ్వు విడాకుల పత్రంమీద సంతకం చేయటం మంచిదే అయింది.'

'కాదు. అది ఆయన్నింకా మనోవేదనకి గురి చేస్తుంది.'

'ఆ మూర్ఖుడిమీద నీకు జాలెందుకు?'

'అన్నయ్యా!..ఆయన నా భర్త!'

'ఒకప్పుడు. ఇప్పుడుకాదు.నువ్వు సంతకం చేసినప్పుడే ఆ పెళ్ళి రద్దయిపోయింది.'

'నేను నమ్మను. లదే నిజమయితే ఈ అనుబంధాలకి అర్థమే వుండదు.'

'అనురాగ మున్నప్పటి మాటకదా! ఇప్పుడు రవికి నీవంటే ఇష్టంలేదు. నీకు అతనంటే...'

'ఇష్టం వుంది.' అని మెత్తగా నవ్వింది అనూరాధ.

'పిచ్చిపిల్లా! నీ అనురాగంలో వందో వంతున్నా అతడు నీనుండి విడాకు లడిగి వుండేవాడు కాదు. అతనికి కావల్సిందేదో దొరికింది. ఇప్పుడు నీవక్కర్లేదు.'

'ఒకప్పుడు కావల్సి వస్తానని నా నమ్మిక.'

'నీ భ్రమ.'

'ఎవరిపిచ్చి వారి కానందం!' అంటూ ఆమె చిన్నగా నవ్వింది.

* * *

'కమలా!'

'ఏమిటా కంగారు?'

'అనూ ఏది?'

'ఏదో చదువుకుంటూంది. ఇంతకీ ఏమయిందండీ!'

'రవికి ఏక్సిడెంటు అయిందిట లేబరేటరీలో వుండగా...' వాసు మాటలు మింగేసాడు. అతనిగొంతు వణుకుతోంది.

'అయ్యో!' కమల గొంతువిని కంగారుగా అక్కడికి వచ్చింది అనూరాధ.

'ఏమిటన్నయ్యా!'

'మరేం కంగారులేదు అనూ! ఏదో చిన్న ప్రమాదం జరిగింది కెమికల్ లేబ్‌లో—మరి అప్పుడక్కడెందుకున్నాడో—రవికి గాయాలు తగిలాయిట...'

ఆమెగుండెలు దడదడలాడాయి. 'మరేం ప్రమాదమయినది కాదుకదా!'

'అయివుండదు. లేకపోతే ప్రమాదం జరిగి వాళ్ళురోజులయ్యేవరకు వాళ్ళమ్మ అగి ఎందుకు ఫోన్ చేస్తుంది?'

'అత్తయ్య ఫోన్ చేయించారా?' అనూరాధ వణికే కంఠంలో మాటలు కొడు వయినాయి.

'ఆ! కొడుకు కష్టంలో వున్నాడు కనుక ఇప్పుడు విడాకులిచ్చిన ఓనాటి కోడలు కావల్సి వచ్చింది. నీ హితమూ ఎరుగని నిన్ను గుండెజబ్బుతో పోయిన రాజశేఖరంగారి మంచితనాన్ని కప్పిపుచ్చి 'కోడలు అడుగుపెట్టి మామగార్ని సాగనంపింద'న్న అపనిందలతో హింసించింది...' వాసు ఆవేశాన్ని అడ్డగిస్తూ,... 'ఇప్పుడవన్నీ ఎందుకండీ! అసలే ఆమె బాధ పడుతుంటే...' అంది కమల.

'నేనన్నది అదే! అలాబాధపడటం అనవసరం. మంచిమనసు తప్ప మరేమీ ఆశించని రాజశేఖరంగారు అనూని రవి యిష్టపూర్వకంగానే కోడలుగా చేసుకున్నారు. కాని, ఆయన పోయాక కొడుకు మనసు విరిచి అనూని రాచి రంపాన పెట్టింది. అనూ చావు బ్రతుకుల్లోవుంటే ఒక్కసారయినా వచ్చి చూసి పోలేదు సరిగదా— నానా మాటలు అంది. ఇప్పుడామె నాదుకోవల్సిన అవసరం మన కేముంది? తమదాకా వస్తే కాని ఎవరికీ తెలియదు!'

వాసు మాటలు వినిపించుకునే స్థితిలో లేదు అనూరాధ. '...ఇంతకీ వారెక్కడున్నారు అన్నయ్యా!'

'హాస్పటల్లో ప్రాణాపాయం లేదు...కాని, కళ్ళు...'

'ఆ! కళ్ళు...కళ్ళ కేమయింది?' ఆమె గుండె లొక్షణం ఆగిపోయినట్లయినాయి.

'వివరాలు తెలియవు.'

'అయితే, వెంటనే వెళ్ళి చూడాలి.'

'మళ్ళాచి వచ్చి నీవు చావు బ్రతుకుల్లో వుంటే ఒక్కసారికూడ చూడటానికి రాని ఆ కరుసుడిమీద నీకిప్పుడు జాలెందుకు కమ్మా!'

'నీ ప్రశ్నలకు జవాబులు చెప్పే స్థితిలో లేను. ఆయన నా భర్త. నేను వారి కష్టంలో ఆదుకోవటం నా కర్తవ్యం! అంతే.'

* * *

'సిస్టర్...'

'ఏం కావాలి?'

'ఎవరది? గొంతు ఎక్కడో విన్నట్లుంది.'

'నన్ను ఈ వార్డులో క్రొత్తగా వేసారు.'

'నీ పేరు?'

'...నా పేరులో ఏముంది సిస్టర్—అని పిలవండి. పలుకుతాను.'

'అది కాదు. నీ కంఠంలో వున్న మాధు

శ్యాము, అప్యాయత నీ పేరులో కూడా చూడాలని'

'సుభాషిణి మూగపిల్ల కావచ్చు. సుందరి కురూపి కావచ్చు. మనస్సు ప్రధానం కాని, మనిషి పేరులో ఏముంది?'

'నీవన్నది నిజం. అయితే, నాకో చిన్న సహాయం చేసిపెడతావా?'

'అందుకేగా నేనిక్కడున్నది!'

'ఆశించినవాళ్ళు కష్టంలో కనపడకపోతే ఎంత బాధగా వుంటుంది? నాకి ప్రమాదం జరిగి నాల్గు రోజులయింది. రెండోసారి సరోజ నన్ను చూడటానికి రాలేదు. కొంచెం ఫోన్ చేసి ఆమెనోసారి రమ్మని చెప్పగలవా!'

'అలాగే!' ఫోన్ నెంబరు తీసుకొని ఆమె వెళ్ళిపోయింది.

ఐదు నిమిషాలు ఐదు యుగాలుగా గడిచాయి అతనికి. 'ఇప్పుడే వస్తానని చెప్పింది.' అంది నర్స్.

'ఇదే మాట రెండు రోజులుగా అంటోంది. కాని, రాలేదు. మనుషులిలా క్షణంలో ఎలా మారిపోతారో!..' కొంచెంసేపాగి, 'సిస్టర్...' అని పిలిచాడతను.

'ఎస్...'

'సరోజ రాగానే చెప్పు. నీవిక్కడే వుంటావుగా!'

'అలాగే.'

అతను మౌనంగా పడుకున్నాడు. అరగంట గడిచింది.

ఓ మెత్తని కరస్పర్శకు ఉలిక్కిపడి, 'ఎవరూ?' అన్నాడు రవీంద్ర.

'సిస్టర్ని. సరోజ వచ్చింది.'

ఒక్క ఉదుటున పైకిలేచి కూర్చున్నాడతను. 'వచ్చిందా! త్వరగా పిలు.'

'నేనిక్కడే వున్నాను—రవీ!'

'సరూ! వచ్చావా? నాన్నగారు రాలేదా?'

'వారూ ఇక్కడే వున్నారు. మీకు కులాసాగా వుందా!'

'ఆత్మీయుల కోసం మొహం వాచివున్నాను. రెండురోజులనుంచి నీకోసం ఎంత నిరీక్షిస్తున్నానో!'

'వద్దామనే అనుకున్నాము రవీ! ఎవరో బంధువులు వచ్చారు. దానితో హడావిడి.. మీకింత కష్టం వచ్చినందుకు మాకందరికీ బాధగావుంది.' అన్నాడు సరోజ తండ్రి.

'సరోజ నా సరసనవుంటే ఎన్ని కష్టాలయినా మర్చిపోగలను శంకరంగారూ!'

# అనూ

'నిజమే ననుకో!... అదయినా ఎన్నాళ్ళుంటుంది? రేపు పెళ్ళయి అత్తవారింటికి...'

రవీంద్ర వణికిపోతూ అరిచాడు. 'శంకరం గారూ! ఏమిటి మీరనేది?'

'ఆవేశపడకు రవీంద్రా! మీ రిద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. నిజమే! ఈ ప్రమాదం జరగపోతే తప్పక జరిగివుండేది కూడా! కాని ఇప్పుడు నీ పరిస్థితి ఏమిటో నీకు తెలుసు...'

'నాకేమైందని? నాల్గురోజులు పోతే కట్లు విప్పేస్తారు. తిరిగివస్తాను నేను.'

ఓక్షణం అంతటా నిశ్శబ్దం.

'మాట్లాడరేమిటి శంకరంగారూ!'

'మీ పరిస్థితి చూస్తే బాధగావుంది రవీ! మీకెలా చెప్పాలో...'

'...శంకరంగారూ! రోగితో నిరాశా పూరితమైన మాటలు మాట్లాడటం మంచిదికాదు' దయయుంచి మీరు వెంటనే వెళ్ళిపొండి.' నర్స్ కంఠం కంపించింది.

'సిస్టర్!' రవి అరిచాడు —' నా అతిథుల్ని పొమ్మనటానికి నువ్వెవరివి?'

'మీ ఆరోగ్యం కాపాడటం నా విధి.'

'నాకేమీ కాలేదు. నేను చూడగలను.'

'మీ రిప్పుడు ఆవేశపడుతున్నారు. మేము మళ్ళీ వస్తాములెండి...' శంకరంగారు అన్నారు నెమ్మదిగా.

'వెళ్ళిపోకండి. సరూ! నన్నువదలి వెళ్ళిపోకు. నాకేమీకాలేదు. ఇదిగో ఇప్పుడే నాకళ్ళు చూపిస్తాను..!' నర్స్ అడ్డుకునే లోగానే అనుకోని ప్రమాదం జరిగిపోయింది. అతను కట్లు వూడ లాక్కున్నాడు.

'అయ్యో! నాకేం కనిపించటంలేదు. అంతా అంధకారంగావుంది. సరూ! నువ్వెక్కడున్నావు? నాకళ్ళు పోయాయి సరూ!...' రవీంద్ర చేతులు బలంగా పట్టుకొని నర్సులిద్దరు డాక్టరుకోసం కేకలు వేసారు. అతను చంటిపిల్లవాడిలా ఏడ్చాడు. డాక్టరు వచ్చి తిరిగి కట్టుకట్టాడు.

'మిస్టర్ రవీ! చివరి ఆశతో మేము ప్రయత్నిస్తున్నాము. మీ రావేశంలో ఆ ఆశ కూడా లేకుండా చేసుకున్నారు. మా చేతుల్లో వున్నంతవరకు చేస్తాము. ఆపైన దేవునిదయ. ధైర్యంగా వుండండి' అంత కన్నా డాక్టర్ ఏం చెప్పగలడు?

ఆ పైన రవీంద్ర చాలసేపు మాట్లాడలేదు. మౌనంగా పడుకున్నాడు.

తిరిగి అదే మృదు స్పర్శ!

'సిస్టర్!'

'ఆ!'

'నన్ను క్షమించు. అనవసరంగా నీపై కోప్పడ్డాను.'

'ఫర్వాలేదు. ముందీ మందు త్రాగండి.' ఆమె అతని వెన్నుకి ఆసరా ఇచ్చి మందు త్రాగించింది. తిరిగి వెనక్కి వాలాడు రవీంద్ర.

'సిస్టర్! సరోజ వెళ్ళిపోయింది కదూ!'

'ఊఁ!'

'నేను నీకేమవుతాను? నాకోసం నీవెందుకింత తాపత్రయ పడుతున్నావు?'

'అది నా ధర్మం!'

'హుఁ! నా అన్న వాళ్ళకి అక్కర్లేక పోయాను. డబ్బు, రూపం, ఆపైన చిత్రకళ ఇన్ని వున్నవాడితో ఎవరయినా స్నేహం చేస్తారు. కాని, కళ్ళు పోయాక చూస్తూ ఎవరు మాత్రం తమ గొంతు కోసుకుంటారు? అవును. సరోజకు నేనిప్పుడు తగను.' అతనో నిమిషం ఆగాడు. '...సంతోషంలో వున్నప్పుడు ఎంతమందయినా చుట్టూ మూగుతుంటారు. కష్టంలో పలకరింపుకే కనిపించరు. ఏమిటో ఈ జీవితం!'

'నేనున్నాను. నాతో మాట్లాడండి. కళ్ళులేని వాళ్ళెంతమంది ఆశలో జీవించటం లేదూ? అన్నిటికీ నేనిక్కడుంటే మీకీ బాధ ఎందుకు? కళ్ళతోకంటె మనస్సుతో చూసినదే సత్యము—సుందరము! నా కళ్ళతో మీరేదయినా చూడగలరు. నా కళ్ళే మీవి.'

'సిస్టర్! నీ మాటలు వింటుంటే నా 'అనూ' గుర్తుకు వస్తోంది...'

'ఎవరామె?'

'ఒకప్పుడు నా భార్య!'

'ఊహుఁ!'

'ఏం—ఆశ్చర్యంగా వుందా! అవును. 'అనూ' నుంచి విడాకులు అడిగిపుచ్చుకుని ఇప్పుడొంటరినైన నిర్భాగ్యుడిని.'

'...'

'ఎందుకో అడగాలనుంది కదూ! చెప్తే నన్ను అసహ్యించుకుంటావు సిస్టర్! అయినా నా మనస్సులోని ఆవేదనని ఆత్మీయులకి

## అనూ

చెప్పుకోవాలని వుంది. వింటావా సిస్టర్!

'చెప్పండి.'

'అనూ' అంటే 'అనూరాధ' అన్నమాట. నేను ముద్దుగా 'అనూ' అని పిలుచుకునే వాడిని. నా జీవిత భాగస్వామిని అయిననాడు ఆమె ఆదాలరాశి మాత్రమే కాదు—నా చిత్ర రచనకి ఆయువుపట్టు. కాని, నాన్న గారి మరణంతో ప్రారంభమయిన కష్టాలు అనూకి మశూచి వచ్చి నాకు ఆరాధ్యనీయమైన ఆమె సౌందర్యాన్ని నాశనంచేసి ఆమెను చెవిటిదాన్నిచేసి నన్నో నిర్భాగ్యుడిని చేసే వరకు ముగియలేదు. ఆమె శిథిల సౌందర్యం నా జీవితాశయాల్ని నిర్వీర్యంచేసి నన్ను విరక్తుడిని చేసింది ఎన్నోసార్లు విందు చేసుకున్న కళ్ళతో తిరిగి ఆమె వికృత రూపాన్ని చూసే ధైర్యం లేకపోయింది నాకు. కాని, ఇప్పుడా కళ్ళే పోగొట్టుకున్నాను ... అదే విరక్తిలో వుండగా సరోజ నా జీవితంలో అడుగుపెట్టింది. నాలో ఉద్దీపన కలిగించిన రెండవ వ్యక్తి సరోజ. భావి జీవితంపై ఎన్నో ఆశలు పెట్టుకున్న నాకు—అందమైన భార్య ప్రక్కన వున్నప్పుడే నా చిత్రకళకు రాణింపు వుంటుందనుకున్న నాకు 'అనూ'నుంచి విడాకులు కోరటంతప్ప గత్యంతరం లేక పోయింది. కాని, ఆ అమృత హృదయిని పల్లెత్తుమాట అనలేదు. ఇప్పుడామె మాటలు అక్షరాలా నిజమనిపిస్తున్నాయి. ఏమందో తెలుసా!'

'ఏమంది?'

'—మీ ఆనందంలో కాకపోయినా కష్టంలో నయినా నేను గుర్తుకు రాక పోను—అని. లేకపోతే, ఇన్నాళ్ళకి ఆమె ఇప్పుడే ఎందుకు గుర్తు రావాలి? నిజంగా ఆమెకీ విషయం తెలిస్తే ఈపాటికి రాకుండా వుండేదా! అనూ అన్నది నిజం! ఒక్క సంతకంతో తెగిపోయే బంధాలు అను బంధాలు ఎలా అవుతాయి? ఇంతవరకు ఈ చర్మ చక్షువులతో బాహ్య సౌందర్యాన్నే చూసి ఆనందించగలిగాను కాని... ఆత్మను సంయమనం చేయలేకపోయాను. ఇన్నాళ్ళు నేను కళ్ళుండి గుడ్డివాడిని, ఇప్పుడు కళ్ళుపోయి...'

'ఆవేశ పడకండి.'

'ఆవేశంకాదు సిస్టర్! ఆవేదన. ఇప్పుడిప్పుడే మనస్సుతో చూడగల్గుతున్న నాకు జీవిత సత్యాలు అర్థమవుతున్నాయి. ఆమె హృదయ సౌందర్యాన్ని నాకు కళ్ళున్నంత కాలం చూసే అదృష్టం లేకపోయింది; ఆమె మాటల్ని నిజం చేయటానికే నేమో నాకు విధి ఈ శిక్ష విధించింది.'

'అలా అనకండి. అవకాశాలు అందరికీ రావు.'

'నీకు తెలియదు సిస్టర్! అవకాశాలు వచ్చికూడ చేజార విడుచుకున్న నిర్భాగ్యుణ్ణి. ఒక్క బాహ్య సౌందర్యమే నా చిత్రకళకు ఉద్దీపనశక్తి నిస్తుందని భ్రమపడ్డాను. ఆ ఉన్మాదంలో జీవితపు విలువల్ని, అను బంధాల అర్థాల్ని గ్రహించుకోలేక పోయాను. తన అందం. ఆరోగ్యం అన్నీ పోగొట్టుకున్న ఆ అమాయకురాలికి భర్తగా నేను చూపినదేమిటి? నిరసన — నిర్లక్ష్యం— నిరాదరణ—ఆఖరికి వివాహం రద్దుచేసుకోటానికి అంక్ష విధించాను. అందం, ఐశ్వర్యం, పేరు ప్రతిష్ఠలు—ఏవి లేక పోయినా ఒక్క అనురాగంతో జీవించవచ్చు. అందుకు 'అనూ' జీవితమే నాకు ప్రత్యక్ష సాక్షి. కాని, నేను ఒక్క చిత్రకళకేకాదు—జీవితంలో ఇక దేనికీ పనికిరాను. గుడ్డి బ్రతుక్కిక ముక్తేమిటి? ఇంతకన్నా మరణం మేలుకదూ!...'

'అంత మాటనకండి.'

'సిస్టర్!... నువ్వు ఏడుస్తున్నావా? నేనింకా ఎంతమంది నేడిపించను?'

ఆమె దుఃఖం ఆపుకుంటోంది.

'రవీ! మీరోమాటివ్వాలి నాకు.'

'నా క్షేమంకోరే నీ కంత్రకటే ఏమివ్వగలను?'

'మీరే నిరాశకు లోనుకాకూడదు.'

'కాని' ఆసరాలేని ఈ అంధకారంలో ఎట్లా పయనించను?'

'నాకళ్ళే మీవని ఎప్పుడో చెప్పాను కదా!'

'ముక్కూమొహం తెలియని నాకోసం ఏబంధం నిన్నిట్లా పలికిస్తోంది.'

'అనుబంధం! జీవితంలో అందరూ ఒక్కరికోసం ఏమీచేయలేక పోవచ్చు. ఏ ఒక్కరో ఏదో కొంత ఆసరా ఇవ్వటంలో ఆశ్చర్యమేముంది?'

* * *

'అమ్మా! రోజూ ప్రొద్దున్నే వచ్చే సిస్టర్ మధ్యాహ్నం కావస్తున్నా రాలేదేమిటి?'

'వస్తుంది రవీ! నెల రోజులుగా నిన్ను కనిపెట్టుకొని వున్నది—ఒక పూట అలా ఆలస్యమయ్యేసరికి ఇంత ఇదవుతావేమి రా?'

రవీంద్ర మందహాసం చేశాడు. 'ఏమోనమ్మా! ఆమె ప్రక్కన లేకపోతే నాకు క్షణం కూడా తోచటం లేదు. ఈ బంధం ఏనాటిదో!'

కొంతసేపు మౌనం.

'రవీ!'

'అమ్మా!'

'ఈ బంధం ఏనాటిదో కాదు. నీ పెళ్ళి నాటిదేరా!'

'అంటే!'

'ఇన్నాళ్ళు ఆమె కోరిక మీద నీకు చెప్పలేదు కాని, ఆమె ఎవరో కాదు...మన అనూరాధ!'

'....ఏమిటమ్మా నువ్వనేది. నాకు పిచ్చెక్కిపోతోంది...సిస్టర్...అనూ, ఒక్కరేనా?'

'ఆవేశపడకు రవీ! నీకు కొంచెం నెమ్మదిగా వుంది కదా అని చెప్తున్నాను. ఇన్నాళ్ళు ఉగ్గబట్టుకున్నాను. ఇక ఆ దేవత కన్యాయం చేయాలని లేదు. అవును బాబూ! అనూ దేవత. ఒకనాడు ఆమెను కష్టపెట్టాను. అయినా ఈనాడు మన ఇంటికే వెలుగైంది...ఆమే లేకపోతే మనమేమైపోదుమో!'

'అయ్యో! ఇప్పటికీ నా మనో నేత్రాలు తెరుచుకోలేదే? ఇన్నాళ్ళు నీకు దగ్గరగా వుండి నీ సేవ అందుకుంటూ నీ ఆప్యాయత ననుభవిస్తూ నిన్ను గుర్తు పట్టలేక పోయానా అనూ! నన్నింత నికృష్టునిగా ఎందుకు పుట్టించావు భగవాన్! మళ్ళీ నానుండి ఆమెను దూరం చేస్తున్నావా ప్రభూ!'

'లేదు బాబూ! అనూ ఇప్పుడే వస్తుంది. నిన్ను విడిచి ఎక్కడికీ పోలేదు.'

'అలా అతను మౌనంగా రోదిస్తూ వుండి పోయాడు.

మరో గంట గడిచింది. ఆమె రాలేదు. అంతకంతకే అతనిలో ఆత్రుత పెరుకు పోతోంది.

'అమ్మా! ఏమని చెప్పి వెళ్ళింది? ఇంకా రాలేదేమిటి?'

'హాళ్ళన్నయ్యగారింటికి వెళ్ళి వస్తానంది బాబూ!'

'ఒకవేళ అలా హాస్పటలుకు గాని వెళ్ళిందేమో!—ఫోన్ చేయరాదూ!'

ఐదు నిమిషాల్లో ఆమె తిరిగి వచ్చింది. 'నీ మందుకోసమే అక్కడికి వెళ్ళిందిట. కాని, తర్వాత ఆమె కనపడలేదని ఓ నర్సు చెప్పింది...అలా అయితే వస్తుండాలి. కాని చెవిలో పెట్టుకునే రేడియో ఇక్కడ మర్చిపోయి వెళ్ళిందిరా! అదే నాకు బాధగా వుంది —'

'అయ్యో!'





'కంగారుపడకు. మరికొంతసేపు చూద్దాం. అదిగో డాక్టరుగారు వచ్చారు.'

'గుడ్ మార్నింగ్ డాక్టర్!'

'గుడ్ మార్నింగ్ రవీ! మీకో సంతోష కరమైన వార్త.'

'ఏమిటది డాక్టర్!'

'ఓ త్యాగమూర్తి తన కళ్లను మీకు దానంచేసింది. ప్రత్యేకంగా మీ పేరు చెప్పి మీకు దృష్టి ప్రసాదించటానికే తన కళ్ళను ఐబేంక్ కి ఇస్తున్నానని ఆమె తన మరణ వాఙ్మూలంలో చెప్పింది. జనరల్ హాస్పిటల్ నుంచి నా మిత్రుడు, ఫోన్ చేసి చెప్పాడు. ఆమె గంట క్రితమే హాస్పటలు వద్ద రోడ్డు క్రాస్ చేస్తూ లారీహారన్ విని పించుకోలేక ప్రమాదంలో చిక్కుకుందిట...'

వణికే కంఠంతో రవీంద్ర అడిగాడు. 'ఎవరా త్యాగమూర్తి?'

ఐయామ్ సారీ రవీ! నేను అడగటం మర్చిపోయాను. మీకింక స్వల్ప వ్యవధి లోనే కళ్ళు రావటానికి అవకాశం వుంది కదా అన్న ఆనందంలో ఆ త్యాగమూర్తి వివరాలడగటం మర్చిపోయాను, డ్యూటీకి పోతూ ఈ శుభవార్త తెలియజేద్దామని ఇలా వచ్చాను.'

'మరోసారి ఫోన్ చేసి కనుక్కోండి డాక్టర్! ప్లీజ్! అంతవరకు నాకు తృప్తిలేదు.'

ఐదు నిమిషాల్లో డాక్టరు ఫోన్ చేసి ఖిన్నవదనంతో తిరిగి వచ్చాడు.

రవీంద్ర తల్లి గొంతు వినిపించింది! 'మాట్లాడరేం—డాక్టర్! ఆ అమృతమూర్తి ఎవరు?'

'త్వరగా చెప్పండి డాక్టర్! మీ మౌనాన్ని భరించలేక పోతున్నాను.' రవీంద్ర వణికే కంఠంతో అర్థించాడు.

'సంతోషవార్త చెప్పిన నోటితోనే ఆ విషాదవార్త చెప్పవల్సిరావటం నా దురదృష్టం. ఆ త్యాగమూర్తి ఎవరో కాదు రవీ! ఇన్నాళ్ళు మీకు సిస్టర్ గా సేవ చేస్తూ మీ మందుకోసం హాస్పటలుకు వచ్చిన మీ భార్య అను రాధ! ఐయామ్ వెరిసారీ!'

'అనూ!...' అని వెర్రిగా కేకపెడుతూ కుప్పగా కూలిపోయాడు రవీంద్ర.

అతని తల్లి కొయ్యబారి పోయింది. ●

మేలిరకం
"డస్ట్"
టీలలో
సాటిలేనిది




# లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ

ఈ టీతో మీరు కమ్మని, చిక్కని బంగారు ఛాయగల టీ కప్పుల
వెంబడి కప్పులు అతి త్వరలో తయారుచేయకలుగుదురు.
ఈ పానీయమును మీరే త్రాగి చూడండి.
అతిథులకుకూడా యివ్వండి. మీరు తప్పక
సంతోషముతో వికసిస్తారు. అవును—మీ
ఆనందభరితులైన అతిథులుకూడాను.
లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ
మేలిరకం టీలలో నిజంగా అద్వితీయమైనది.



లిప్టన్స్ అంటే
మంచి టీ




8HGC-4 TEL

### జరిగిన కథ

పరీక్షహాలులో కాపీలు రాస్తుంటే పట్టుకున్న శంకరం మాస్టారిమీద విద్యార్థులు పగతీర్చుకో జూస్తున్నారు. వేణుకు మరీ కోపంగావుంది. వేణు అక్కయ్య జ్యోతి. శంకరం మాస్టారి మంచితనాన్ని గ్రహించిన జ్యోతి, గోపీని ఆయనదగ్గరకు ట్యూషనుకు పంపిస్తుంది. గోపీ అయిష్టంగానే వెళ్తుంటాడు. జ్యోతి స్నేహితురాలు రాధ. రాధ వాళ్ళన్నయ్య మోహన్. మోహన్, జ్యోతి ప్రేమించుకున్నారు. జ్యోతికి శంకరం మాస్టారి భార్య పార్వతితో పరిచయం ఏర్పడుతుంది.

## 4

'విసుగు చెందని విక్రమార్కుని' చందంలా రోజూ అయిదున్నరకల్లా బయలుదేరి ముందుగా శంకరంగారిల్లు చేరుకోడం మామూలైపోయింది వేణుకు. ఒకసారి కాకపోతే ఒకసారయినా యీయన వేళ తప్పకుండా వుండడని వేణు నమ్మకం. పై అధికారులు ఎప్పుడు తప్పుచేస్తారా అని క్రింద అధికారులు కనిపెట్టుకు వున్నట్లే మేషారు రవంత పొరబాటు చేస్తే పట్టుకోడానికి విద్యార్థులు అంత జాగ్రత్తగా కనిపెట్టి వుంటారు! వారం రోజులు గడిచినా శంకరంగారు వేళ తప్పి రావడం జరగలేదు. కానీ యీ లోపల బాబు బాగా స్నేహమయ్యాడు వేణుకు. బాబుకు రంగు రంగుల బొమ్మల పుస్తకాలు తెచ్చి చూపడం, చిన్న చిన్న పద్యాలు చెప్పించడం వేణుకు సరదాగా వుండేది. అప్పుడప్పుడు ఈ బాబు శంకరంగారి అబ్బాయని గుర్తొచ్చినప్పుడు మాత్రం కసిరికొట్టేవాడు. అంతలోనే బిక్కమొహం పెట్టుకు నిలబడ్డ బాబును చూసి కోపం మర్చిపొయ్యేవాడు వేణు.

ఒకరోజు గుండీలు లేని వేణు చొక్కా చూసి శంకరంగారు అడిగారు. వేణుకు భగ్గుమంది. తనెలాంటి డ్రస్సు వేసుకుంటే యీయన కెందుకు ? అనుకున్నాడు. అందుకని—

'గుండీలు తెగిపొయ్యాయి?' అన్నాడు తల బిరుసుగా... నిజానికి చొక్కాకు గుండీలు వుండనే వున్నాయి. కానీ గుండీలు పెట్టుకోడం వేణు దృష్టిలో శుద్ధబుద్ధావతారాలు చేసేపని. చొక్కాకు పైవరుస రెండు గుండీలు వదిలేసి, పొడుగుచేతుల చొక్కాను మోచెయ్యి క్రిందదాకా మడిచి, క్రాపును




మొహంమీద పడేలా దువ్వుకుంటే అది వీరుల లక్షణమన్నమాట!

'గుండీలు తెగిపోతే కుట్టుకోవచ్చుగా?' అని అడిగారు శంకరంగారు.

'తెగిపోయినప్పుడల్లా గుండీలు కుట్టుకోడానికి మేమంత గొప్పవాళ్ళం కాదండీ...' అని తపీమని సమాధానం యిచ్చాడు వేణు.

ఆరోజు శంకరంగారిక ఆ విషయం ఎత్తలేదు. మర్నాడు వేణు ట్యూషనుకు రాగానే ఒక పాకెట్ చేతికందిచ్చారు శంకరంగారు. 'ఏమిటివి?' అనుకుంటూ తీసిచూస్తే అందులో గుండీలున్నాయి!...

'ఎందుకివి?' అన్నాడు ఆశ్చర్యపోతూ వేణు.

'ఫరవాలేదు వుంచండి...గుండీలు తెగిపోయినప్పుడల్లా కుట్టుకోవచ్చు...' అని శంకరంగారు అనగానే వేణుకు ఏమనడానికీ పాలుపోలేదు. మర్నాడు చేసేదిలేక గుండీలు పెట్టుకునేవచ్చాడు వేణు.

శంకరంగారు పాఠం చెప్పేపద్ధతి, 'ఆయన మాటతీరు వేణుకు నచ్చినా మధ్యమధ్య మనసులో కసి కెలుకుతూనేవుంది. 'ఈయనే తన పరీక్ష చెడగొట్టాడని.' దానికితోడు తను వేలెత్తి చూపించడానికి వీల్లేకుండా ఆయన ప్రవర్తించడం వేణుకు కొంచెం వుడుకుమోతుతనం కలిగించింది. అంతకూ ఆయన్ను కవ్వించాలనే వుద్దేశంతో ఒకరోజు యింటిలెక్కలన్నీ తప్పుచేసుకొచ్చాడు. ఏమంటాడో చూద్దామని!...శంకరంగారు ఆ లెక్కలన్నీ మళ్ళీ విపులంగా బోధించి అదే 'మోడలు' లెక్కలు మళ్ళీ ఓపది యింట్లో చెయ్యమన్నారు. మర్నాడు వేణు కావాలని 'హోమ్‌వర్క్' చెయ్యకుండా వెళ్ళాడు... ఆరోజు దగ్గరుండి ముందు ఆ లెక్కలన్నీ చేయించి తర్వాత మరో పాఠం చెప్పారు శంకరంగారు. ఆరోజు యింకో అరగంట ఎక్కువ కూచో వలసొచ్చేసరికి 'ఇంట్లో చేసి పడేస్తుంటే పీడావదిలేది' అనిపించింది వేణుకు. ఏరోజు కారోజు యీ విషయాలన్నీ మిత్రుల రైలు పట్టాలమీద సమావేశంలో చర్చకు వస్తూనే వున్నాయి.

ఒక రోజు 'మిత్ర మండలి' సమావేశమయి వుండగా శంకరంగారు అటు రావడం తటస్థించింది. వాళ్ళను చూడగానే సైకిలు దిగి 'ఏం చేస్తున్నారు మీరంతా యిక్కడ?' అని అడిగారు శంకరంగారు.

'ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నాం....' అన్నాడొకడు.

'దానికి బదులు ఒక జట్టుగా ఏర్పడి ఏదన్నా ఆటలు ఆడుకోవచ్చుగా?...' అన్నారు శంకరంగారు.

'ఆఁ...ఏ మాటలాడుతాం?...' అంటూ తేల్చేశాడు గోపీ.

'ఆటలకు 'గ్రౌండు' ఎక్కడుంది? 'బాట్స్' అవీ ఎక్కడ తెస్తాం?' అన్నాడు భాస్కరం.

'ఓష్! మీరు అనుకోవాలేగాని సమకూర్చుకోడం ఎంత పని! అసలు మీకు ఆడుకోవాలని 'ఐడియా' వుంటే మిగతాది సమకూర్చే బాధ్యత నాది' అన్నారు శంకరంగారు.

'ఆఁ ... ఇవన్నీ అయ్యేవా పొయ్యేవా? ఎందుకు లెండి మేష్టారూ.' అని నీళ్ళు నమిలాడు సోమేశం.

'మేష్టారూ!...మీరు అన్నీ అమరుస్తానంటే మేము ఆడుకుంటాం చెప్పండి....' అన్నాడు వేణు వెంటనే, 'పెద్ద సమకూరుస్తాట్ట! ఏ మాత్రం సమకూరుస్తాడో చూద్దాం...' అని మనసులో అనుకుని.

'అయితే మీకు ఏ ఆటంటే ఎక్కువ

యిష్టం?...'

'క్రికెట్...' తకీమని జవాబిచ్చాడు వేణు. 'వికెట్స్, బాట్లు' అవీ తెప్పించడం ఒకాయన తరమా అనే ధీమాతో.

'క్రికెట్ అంటే యిష్టమా... అయితే నాతో రండి...' అని వాళ్ళను తీసుకుని అక్కడికి దగ్గరలోనే వున్న ఒక యింటి దగ్గరకు వెళ్ళి—

'డేవిడ్!...' అని పిల్చాడు.

'ఏమిటి మేష్టారు?...' అంటూ వచ్చాడు వేణు యీడు కుర్రాడొకడు.

'క్రికెట్ టీమ్ సరిపడాలేదని అంటున్నావు గదా...ఇదిగో... వీళ్ళందరూ ఆడుతామని వచ్చారు... మీరంతా ఒక 'టీమ్'గా ఆడుతుంటే సరి...'

'నా దగ్గర వికెట్సు, బాట్, బాల్ అన్నీ వున్నాయి గాని...'గ్రౌండు' లేదు కదండీ...' అన్నాడు డేవిడ్.

'గ్రౌండు కేముంది!...మీ యింటి ముందు యిదంతా ఖాళీ స్థలమేగా...ఇక్కడాడుకో వచ్చు...'

'అంతా ఎత్తుపల్లాలుగావుంది యీస్థలమెందుకు పనికొస్తుంది మేష్టారు?...' అని అభ్యంతరం చెప్పాడు వేణు.

'ఓష్! దీన్ని బాగుచెయ్యడం ఏమంత పనిండీ...పట్టుమని పదినిముషాలు పట్టదు నడుము వంచితే...ఏదీ...డేవిడ్! ఓపారా, తట్టా అవీ పట్టుకురా...' అన్నారు పైకి లేచి ప్యాంటువేసి లాల్చీచేతులు పైకి మడుస్తూ శంకరంగారు.

తేలిపోని బాధ ,యిదేమిటి అనుకుని మాట్లాడకుండా నిలబడ్డారు భాస్కరం, గోపీ...వేణుకు, సోమేశానికి ఎన్నాళ్ళనుండో క్రికెట్ ఆడాలనివుంది...'క్రికెట్ కామెంటరీ' వినడానికి స్కూలుగూడా మానెయ్యాలని వుండేది వేణుకు. వాళ్ళ నాన్నగారి భయానికి ఆటలజోలికి వెళ్ళేవాడుకాడు... ఆయితే చనిపోయ్యాక ఆడాలనివున్నా మిత్రులు నిరుత్సాహపరచడంతో వూరుకోవలసివచ్చింది.

డేవిడ్ లోపలికెళ్ళి పారా, తట్టా అవీ తీసుకొచ్చాడు. శంకరంగారు మెరకగావున్న చోట పారతో చదునుచెయ్యడం మొదలెట్టేసరికి 'మేష్టారు! మీకెందుకంత శ్రమ!... మీరలా నిలబడండి ... మేము చేస్తాము' అన్నాడు డేవిడ్. డేవిడ్ శంకరం గారి క్లాసులో కుర్రాడు. డేవిడ్‌కు శంకరం గారంటే మంచి అభిమానం. డేవిడ్‌కనే ఏమిటి? ఆయనదగ్గర చదువుకున్న వాళ్ళందరూ ఆయనకు ప్రత్యేకగౌరవం యిస్తారు. ఆయనమీద అభిమానమూ చూపుతారు...

డేవిడ్ అట్లా అనగానే వేణుగూడా 'నిజమే... మేష్టారు... మీరలా చూస్తుండండి...' అన్నాడు.

'ఫర్వాలేదులెండి...అందరం తలో చెయి



# పూర్వా సంధ్యా ప్రవర్తతే..

వేస్తే పావుగంటలో పూర్తిచెయ్యొచ్చు...' అన్నారు మట్టిని తట్టలోకెత్తుతూ... తర్వాత 'ఏవోయ్! డేవిడ్!...ఇంకొక తట్ట గూడావుంటే తీసుకురా... అని పురమాయించి వేణునుచూసి 'మీరిది ఆవల్లంలో పోసి రండి...' అన్నారు.

వేణుకు ఏమనిపించిందో ఏమో 'నన్నూ 'వేణు' అని పిలవండి మేష్టారు. చాలు...' అన్నాడు. ఆక్షణాన డేవిడ్ మేష్టారుకి అత్యంత సన్నిహితుడిలా మెలగడం, తను దూరంగా మెలగడం కొంచెం కష్టంగా తోచింది వేణు మనసుకు.

శంకరంగారు గబుక్కున తలెత్తి వేణు ముఖంలోకి పరీక్షగా చూశారు అతడిభావా లను పసిగట్టాలని...వేణు ఆచూపును అర్థంచేసుకున్నాడు... 'నేనూ డేవిడ్‌లా మీ స్టూడెంటునేగా... నన్నూ మామూలుగానే పిలవండి...' అన్నాడు. ఆమాటల్లో డేవిడ్ మీద రవంత ఈర్ష్యకూడావుంది.

శంకరంగారు మాట్లాడలేదు. మౌనంగా తట్టలోకి మట్టి ఎత్తుతున్నారు. అంతదాకా దూరంగావుండి 'ఇదెక్కడి గోలరా' అని చూస్తున్న భాస్కరం, సోమేశం యిక తప్పేలాలేదు అనుకుని చేతులుపైకి మడిచి పనిలోకి దిగారు. ముందు ఏమిటీ పని అస హ్యంగా అనిపించినా అందరూ కలిసి చేస్తుంటేను సరదాగానేవుంది! పదినిముషాలకు అందరూ హుషారుగా పనిచెయ్యడం మొదలెట్టారు.

'చీకటిపడబోతోంది యిక యివ్వాళ చదువు తప్పిందిలే' అనుకుంటున్న వేణుకు 'ఆరుగంటలకు పదినిముషాలేవుంది... ఇంక మనం వెళ్దాం...' అని శంకరంగారు అన డంతో కాస్త విరాళి కలిగింది.

మరునాడు అందరూ కలిసి 'గ్రౌండు' చదునుచెయ్యడం పూర్తిచేశారు. ఆరోజు డేవిడ్‌తోబాటు అతడి క్లాసుమేట్ ఫ్రాంక్లిన్ యింకా యిద్దరు కుర్రాళ్లుగూడా వచ్చారు. 'గ్రౌండు' పని అయ్యాక యిక 'టీమ్'లో ఎవరెవరు అనే విషయంవచ్చింది. అందరూ కలిస్తే శంకరంగారు కాకుండా ఎనిమిది మందేవున్నారు. ఇక ఆట ఎలా సాగుతుంది? 'టీమ్‌పెట్టుకోడమెలా' అన్నేప్రశ్న వచ్చింది.

'ఇంకా ముగ్గురుంటే చాలు కదండీ... మీకెందుకు రేపు నేను తీసుకొస్తాను ఆ ముగ్గుర్నీ...' అన్నాడు వేణు ధీమాగా.

అయితే యింకేం...యీ సమస్య పరిష్కారమైనట్లే...ఇక మీ 'టీమ్'కు కెప్టెన్‌ను ఎన్నుకోండి...' అన్నారు శంకరంగారు.

డేవిడ్‌కు తను కెప్టెన్ అవాలనివుంది. అతడికిఆటలోకూడా కొంత అనుభవముంది. కానీ తను కెప్టెన్‌గావుండడానికి వేణు వొప్పుకుంటాడా? ఒప్పుకున్నా అతడి మిత్రుల్నందర్నీ తను కంట్రోలు చెయ్యగలడా?...వీళ్లందరూ తనమాటక్రిందవుండి ఆడమంటే ఆడుతారా? అని సందేహం వచ్చింది. వేణుక్కూడా తను కెప్టెన్ అవుతే బాగుండుననిపించింది, 'కానీ యీ డేవిడ్ ఒకనాడున్నాడుగా' అనుకున్నాడు. అందరూ ఒకరిముఖాలొకరు చూచుకుంటున్నారు. చివరికి డేవిడ్, 'మేష్టారూ! మీరే చెప్పండి' అన్నాడు...శంకరంగారు వేణు ముఖంలోకి చూశారు.

'మీరెవర్ని చెబితే వాళ్లనేవుంచుదాం...' అన్నాడు వేణు.

శంకరంగారు ఓక్షణం ఆలోచించి 'వేణుగోపాల్ కెప్టెను' అన్నారు.

ఆ తర్వాత మళ్లీ 'టీమ్'కు పేరేమి పెట్టాలనే అనుమానం వచ్చింది.

'అదీ మీరే చెప్పండి మేష్టారు...' అన్నాడు వేణు యిరుపక్షాలు ఒక్కనిర్ణయానికి రాలేక తికమకపడి.

'అన్నీ చెప్పడమేమిటి? మీరందరూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి పేరు పెట్టుకోవాల్సిందే...పేరు నిర్ణయించడానికే మరింత వాగ్వివాదాలు జరిపితే యిక కలిసి కట్టుగా ఆట ఏం ఆడుతారు?' అనగానే 'సరే డేవిడ్! నువ్వు చెప్పిన పేరే పెడదాం' అన్నాడు వేణు.

*  *  *

సంజకెంజాయ కాంతిలో రంగురంగుల మేఘ శకలాలతో కన్నులపండువు చెయ్యాల్సిన ఆకాశం మేఘావృతమైవుంది. కలకల లాడుతూండాల్సిన ప్రకృతి ఏదో గంభీరంగా ఆలోచిస్తున్నట్లుగావుంది. ఏం చెయ్యడానికి పాలుపోక ఆలోచనలతో సతమతమవ్వటానికి జ్యోతి బరువుగా నిట్టూర్చింది ఆకాశం నిట్టూర్పు విడచినట్టు...అసలు మధ్యాహ్నం అమ్మచెప్పిన విషయం ఎంతవరకూ నిజం అనేది తెల్సుకోలేకపోతోంది జ్యోతి...

అసలు చిన్నాన్న మోహన్ వాళ్ళయింట్కి వెళ్ళాడా? వాళ్ళ తల్లిదండ్రులతో నిజంగా మాట్లాడేవుంటాడా? ... వాళ్ళు అంత నిర్మొహమాటంగా మాట్లాడేవుంటారా?.. మోహన్ యిదంతా చూస్తూ తనకేమీ పట్టనట్టు వింటూ వూరుకుంటాడా?... ఇదెంతవరకు నిజం! ఎంతవరకూనమ్మొచ్చు? అయినా అమ్మ అబద్ధం చెప్పాల్సిన అవసరం ఏమొచ్చింది? ... తను మోహన్ విషయం చెప్పగానే అమ్మ అడ్డుచెప్పనేలేదు! '...చిన్నాన్నను పిలిపించి ఆయన్నువెళ్ళి మాట్లాడి రమ్మంటాను' అని చెప్పింది ... అలాగే చేసింది కూడా...ఒకవేళ చిన్నాన్నే మోహన్ వాళ్ళయింటికి వెళ్ళలేదేమో?...అయినా తన పిచ్చి!...ఆయనకుమాత్రం అబద్ధం చెప్పాల్సిన అవసరమేమొచ్చింది?... 'పిల్ల పెళ్ళివిషయం మీతో సంప్రదించాలని అత్తగారు అనుకుంటున్నారు. వీలు చూచుకొని ఒక్కసారి రమ్మని' రాయగానే పాపం పనులన్నీ ఆపుకుని వచ్చాడాయన...

మరి ఏది నిజం?...మోహన్ నాన్నగారు 'పదివేలు కట్నమిచ్చి మిగతా అన్ని లాంఛనాలూ జరిపేట్లయితేనే మాట్లాడండి' అని నిక్కచ్చిగా చెప్పేవుంటారా?...ఒకవేళ ఆయన ఫలానా అని తెలీదేమో...అయినా నేనంతా చెప్పాననే అంటున్నాడుగా చిన్నాన్న?...

జ్యోతి ఏమీ తేల్చుకోలేకపోయింది. అయినా యిలా మథనపడేకంటే మోహన్‌తో మాట్లాడితే సరిపోతుందిగా? ఈ విషయం మోహన్‌కు తెలుసంటే తను నమ్మలేదు. తన మోహన్ ఎప్పుడూ అలా ప్రవర్తించడు!...అనుకుంది...చప్పునలేచి 'అమ్మా!... నేను మా స్నేహితురాలింటికి వెళ్ళొస్తాను' అనిచెప్పి, ఆవిడ— వానొచ్చేలావుంది వద్దని వారిస్తున్నా వినిపించుకోకుండా బయలు దేరింది జ్యోతి.

మోహన్ వాళ్ళయింట్లో పంచలో ఎవ్వరూ కన్పించలేదు. మోహన్ గదిలోంచి సన్నగా 'రేడియో సిలోన్' వినిపిస్తోంది. సరాసరి మోహన్ గదిలోకి వెళ్ళింది జ్యోతి,

ఖర్చ్ స్ట్రెచ్ బెడ్ 'పిక్ని' తిరగేస్తున్న మోహన్ జ్యోతిని చూసి 'ఓహో! పెళ్ళికూతురుగారు వురుకులు పరుగులు మీద వచ్చినట్లు న్నారు. తెగ ఆయాస పడుతున్నారు...ఏమిటి కథ? అన్నాడు నవ్వుతూ.

జ్యోతి నవ్వలేదు. నవ్వడాని క్కూడా ప్రయత్నించలేదు. గంభీర వదనంతో కుర్చీ అతడికి దగ్గరగా జరుపుకుని కూర్చుంటూ 'నేను నీతో మాట్లాడుదామని వచ్చాను' అంది.

'మోహన్ గతుక్కుమన్నా కన్పించకుండా బలవంతాన నవ్వు తెచ్చుకుని 'కొద్దిరోజుల

# "పూర్వాసంధ్యా ప్రవర్తతే..."

ఓపిక పడితే గంటలతరబడి మాట్లాడుకో వచ్చుగా...' అన్నాడు.

జ్యోతి యీ మాటలు విన్పించుకోనట్లే సూటిగా అతడి కళ్ళల్లోకి చూస్తూ, 'నిన్న మా చిన్నాన్నగారు వచ్చారుటగా మీ యింటికి?' అని అడిగింది.

మోహన్ జ్యోతి చూపులు తప్పించుకోడానికి టేబిల్ మీద వున్న 'ఏష్‌ట్రే'లో సిగరెట్ దులుపుతున్నట్లు అటు చూస్తూ 'అవును.' అన్నాడు.

'మీ నాన్నగారు కట్నం కోరినమాట నిజమేనా?...'

'అబద్ధమై యుంటుందని ఎందుకనుకుంటున్నావో నాకు తెలియటంలేదు...'

'మోహన్!...' అంది వులిక్కిపడ్డట్లుగా జ్యోతి. 'మోహన్! నువ్వేనా యిలా మాట్లాడుతోంది?... నువ్వేనా?...' ఆవేదన మిళితమైన స్వరంతో అంది. కళ్ళనుండి రెండు నీటి చుక్కలు జారి చెక్కిళ్ళ మీద పడ్డాయి.

మోహన్ కొద్దిగా చలించాడు. జ్యోతి చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు, 'మీ వాళ్ళు అంత ఆస్తిపరులు. ఒక్క పదివేలు పోస్తే వాళ్ళ ఆస్తి తరుగుతుందా?... కరుగుతుందా? ఆలోచించు...వాళ్ళేం పరాయి వాళ్ళకేం యివ్వటంలేదు. తమ యింటి ఆడబిడ్డకేగా యిస్తున్నారు?...' అన్నాడు.

'లేదు మోహన్! నీకు మా యింటి పరిస్థితి తెలియదు. మా నాన్నగారి సంపాదన అంతా ఆనాటి దర్జాలకే సరిపోయింది. మిగిలింది తాతలనాటి ఆస్తి. దానితోనే గుంభనంగా కాలం గడుపుకొస్తోంది అమ్మ. ఇప్పుడు పదివేలు కావాలంటే వాళ్ళు ఏ పొలమో అమ్మాలి... వేణు చిన్నవాడు... వాడికి ముందు ముందు ఎంతో ఖర్చు పెట్టాల్సి వుంటుంది ... నాకోసం వాడికి అన్యాయం చెయ్యడం నా కిష్టంలేదు... ఆలోచించండి మోహన్ మీరు చదువుకున్నవారు...' అర్థిస్తున్నట్లు ఆశగా అతడి కళ్ళల్లోకి చూస్తూ అంది.

'నువ్వు మా యింటి పరిస్థితి ఆలోచించు జ్యోతి!...నా చదువుకుగాను పదివేలు అప్పుచేశారట నాన్నగారు...అది తీరడమెలా?'

'మీ చదువుకు మీ నాన్నగారు అప్పు చేస్తే అది మీరు వుద్యోగం చేసేటప్పుడు మనం తీర్చవచ్చుగా?'...

'ఇంత కష్టపడి చదివింది పచ్చడి మెతుకులు తింటూ వుద్యోగంచేసి అప్పులు తీర్చడానికా? ... జల్సాగా జీవితం గడపడానికా?'

జ్యోతి క్షణకాలం మాట్లాడలేదు. 'పోనీ మీకు కష్టపడడం యిష్టంలేకపోతే బి. ఎ. పాసయ్యాను గదా...ఎక్కడోక్కడ రెండొందలువచ్చే వుద్యోగం చెయ్యగలను. నేను వుద్యోగంచేసి ఆ అప్పు తీర్చే బాధ్యత నాది... సరేనా?...'

'మా యింటి కోడలు...యింజనీరు భార్య ముష్టి వుద్యోగం చేస్తూ వూళ్ళుపట్టుకు తిరగడం మాకు మర్యాదా?...'

జ్యోతికి కొరడాతో కొట్టినట్లయింది. మోహన్ చేతిలోవున్న తన చేతిని విసురుగా లాక్కుంది. కుర్చీలోంచి లేచి నిలబడి—

'మోహన్! ఆఖరుసారి అడుగుతున్నాను మీకు కావల్సింది నేనా?...లేక నేను తెచ్చే కట్నమా?...' అని సూటిగా అడిగింది.

'కామినీ కాంచనాలు రెండూ కావల్సినవే...' కుర్చీలో వెనక్కు చేరబడి పొగను విలాసంగా వదులుతూ అన్నాడు మోహన్.

జ్యోతి క్షణంపాటు బేఫీకరుగా, విలాసంగా కూర్చున్న మోహన్ వైపు పరిశీలనగా చూచింది. 'ఆడపిల్లల మనసులతో వీళ్ళు ఎంత తేలికగా ఆడుకుంటారు?...' అనుకుని బరువుగా నిట్టూర్చింది...'వస్తాను మోహన్' అంది గంభీరంగా.

'పెళ్ళికూతురుగానేనా మళ్ళీ కన్పించడం?...' అంటున్న మోహన్‌కు జవాబు చెప్పకుండా బయటకు వచ్చింది...తలుపు పక్కగా నిలబడ్డ మోహన్ తల్లిని గాని, అవతల నిలబడ్డ రాధను గాని పలకరించకుండానే చర చర బయటికి నడిచింది.

'ఎంత జాణో చూడవే రాధా నీ స్నేహితురాలు!...కాని కట్నం లేకుండా యింజనీరును కొట్టెయ్యచ్చు గదా అని నీతో స్నేహం చేసుకుంది...'

గేటు దాటుతున్న జ్యోతి చెవుల్లో మోహన్ వాళ్ళమ్మ మాటలు గింగురుమన్నాయి. గుండెల్లో చెలరేగుతున్న తుఫాను కన్పించకుండా గంభీరత ముసుగులో దాచుకుని మౌనంగా యిల్లు చేరుకుంది జ్యోతి. లోపల గదిలో జానకమ్మగారు, ఆవిడ మరిదీ, అత్తగారూ ఏదో మాట్లాడుకుంటున్నారు. జ్యోతి కిప్పుడివేమీ అర్థమయ్యేట్లు లేదు. సరాసరి మేడమీదకు వెళ్లి పక్కమీద వాలిపోయింది.

మర్నాడు మధ్యాహ్నం యింట్లో ఎవ్వరూ లేరు అమ్మా, బామ్మా వాళ్ళు పురాణం వినడానికి వెళ్ళారు. వేణు యీమధ్య సమయం చిక్కితే 'బాటు' పుచ్చుకుని బయలుదేరుతున్నాడు. జ్యోతి ఒక్కతే ఆలోచిస్తూ కూర్చుంది.

'ఓహో!..ఏమిటే ఆలోచన?.., మనుషులొచ్చినా గమనించకుండా?' జ్యోతి వులిక్కిపడి చూసింది.

ఆ తలుపుదగ్గర నిలబడి నవ్వుతున్నాను

ఆనందరావు.

'ఓహో !... రండి...లోపలకు రండి...' తొట్రుపడుతూ ఆహ్వానించింది జ్యోతి... 'బావగారు దారితప్పి వచ్చినట్టున్నారు?...' అంది నవ్వడానికి ప్రయత్నిస్తూ...

'దారితప్పేం ఖర్మ!...కావల్సిన వాటికోసం దారి వెతుక్కుంటూనే వచ్చాను...' అన్నాడు ఆనందరావు చిరునవ్వుతో.

ఆనందరావు బావ చాలా మారిపోయ్యాడు అనుకుంది జ్యోతి. అత్తా కోడలంచు పంచ పైన జరీకండువా...ఆజానుబాహు విగ్రహం. విశాలమైన వక్షస్థలము. కళ్ళల్లో దాగిన అరుణిమ, మాటల్లో గంభీరతతో కూడిన చమత్కారం. జ్యోతి ఒకసారి చూసి తల వంచుకు కూర్చుంది.

'అత్తా వాళ్ళు ఏరి?...' ఆనందరావు ప్రశ్న.

'లేరు...పురాణానికి వెళ్ళారు...' అని చెప్పి, 'ఇప్పుడే వస్తానుండండి...' అంటూ లోపలికివెళ్ళి స్టౌ వెలిగించి కాఫీపెట్టి పట్టుకొచ్చేసరికి పదినిముషాలు పట్టింది. జ్యోతికి ఆనందరావు వెళ్ళిపొయ్యాడేమో నని అనుమానం వచ్చింది. చూస్తే పత్రిక తిరగేస్తూ కూర్చున్నాడు ఆనందరావు. 'హమ్మయ్య..వెళ్ళిపోలేదన్నమాట...' మనస్సులో అనుకుని పైకి మాత్రం పెద్దగానే అంది జ్యోతి.

'వెళ్ళిపోతానన్న ధైర్యంతో కాఫీ కాచావా?...'

'అబ్బెబ్బె!... అలస్యమైందని కోపం వచ్చిందేమో ననుకున్నాను...' అంది కాఫీ అందిస్తూ...కాఫీ అందుకుంటూ అదోలా చూశాడు జ్యోతి కళ్ళల్లోకి ఆనందరావు. జ్యోతి వెంటనే తల వాల్చేసుకుంది.

'జ్యోతీ !...' మృదువుగా పిల్చాడు ఆనందరావు.

జ్యోతి తలెత్తి అతడివైపు చూసింది.

'ఆ విషయం ఏమని ఆలోచించావ్?...'

'ఏ విషయ మంటారు?...'

'అదే...అత్తకు వుత్తరం వ్రాశాను?...'

'ఏ మాలోచించవ మంటారు?...'

'నీకు నన్ను చేసుకోడం యిష్టమో అయిష్టమో తేల్చి చెబితే సరిపోతుం దిగా?...' అన్నాడు.

'ఇష్టముండదని ఎందు కనుకుంటు న్నారు?...' మళ్ళీ ఎదురుప్రశ్న వేసింది.

'నువ్వు వాళ్ళంటి ఎక్కువ చదువు కున్న దానివి. ప్రతియువతి తనకంటె విద్యాధికుడే కావాలని కోరు కుంటుందట !.'

జ్యోతి కళ్ళల్లో మోహన్ మెదిలాడు... తెలియకుండా నిట్టూర్చింది జ్యోతి. 'విద్యను తప్ప హృదయ సంస్కారాన్ని ఆశించ దటనా?...' అని మెల్లిగానే అడిగింది.

ఆనందరావు జవాబు చెప్పలేదు ఆ విషయం నువ్వే చెప్పాలన్నట్టు జ్యోతి ముఖంలోకి చూశాడు...

జ్యోతి ఒకక్షణం మౌనంగా వుంది. తర్వాత, 'మరి...నా మనసుకూడా నేను తెల్సుకోవాలిగా...' అంది చిన్నగా.

ఆనందరావు చిరునవ్వు నవ్వాడు...'అన్ని ఏళ్ళు ఒక్కయింట్లో వున్నాం. పోనీ అప్పుడు చిన్నదాని వనుకుందాం. ఈ మధ్య యిన్ని వుత్తరాలు గుప్పించాను. ఇంతకాలం వేచివున్నాను. పైగా అరగంటనుండి నీతో మాట్లాడుతున్నాను. ఇంకా మాటల్లో చెప్పాలంటావా?...'

జ్యోతి పెదవులమీద చిన్న దరహాసం మెరిసింది. 'కాళ్ళుకడిగి కన్యాదానం చెయ్యదల్చుకున్నవాళ్ళ కట్నం ఏమాత్రం చెల్లించుకోవాలో గూడా చెబితే సరి పోతుంది...' అంది.

'కట్నమా !...లక్ష్మిలాంటి పిల్లే లక్ష రూపాయల కట్నం పెట్టు...'

జ్యోతి తలెత్తి అతడి కళ్ళల్లోకి చూసింది ఆశ్చర్యం... 'నిజంగా మీరు కట్నం తీసుకోరా!...' అంది నమ్మకం కలుగక ..

'ఏం ఎవరో ఒకరు కొనుక్కుంటారులే అనుకున్నావా పాపం?...' అన్నాడు ఆనందరావు.. జ్యోతి మాట్లాడలేదు. విప్పార నేత్రాలతో అలా చూస్తూనే వుంది...

ఆ తర్వాత 'పరిషత్ ఆఫీసులో పనుంది' అంటూ వెళ్ళిపొయ్యాడు ఆనందరావు.

మరునాడు మధ్యాహ్నం హాల్లో కూర్చుని చిన్నాన్నగారు ఏదో వ్రాస్తున్నారు. ప్రక్కన తల్లి, మామ్మ ఉన్నారు...హాల్లో అపరిచిత వ్యక్తులు యింకా ఎవరెవరో ఉన్నారు. వ్రాయడం అయ్యాక ఆయన వ్రతం చదివి వినిపించారు. అంతదాకా తలుపుచాటున వుండి చూస్తున్న జ్యోతికి అప్పుడు తెలిసింది. అది పొలం విక్రయ దస్తావేజు. ముందు బయానా యిచ్చి వ్రాయించుకుంటు న్నారని...జానికమ్మగారు సంతకం పెట్ట బోతోంది. 'అమ్మా!...' అని పిల్చింది జ్యోతి. 'ఏమిటమ్మా...' అంటూ వచ్చింది జానికమ్మగారు.

'ఎందుకమ్మా మూడెకరాలు అమ్ము తున్నారు? అందులో అంత తక్కువ ధరకు?'

'మరి మన దగ్గర డబ్బు ఎక్కడుంది దమ్మా...బాంకిలో వుంది మూడువేలేగా... వాళ్ళు ఎంత అడిగినా పదివేలకు కాని తగ్గ మన్నారుట...' అంది.

'వద్దమ్మా...పొలం అమ్మవద్దు...నేను ఆ సంబంధం చేసుకోను.' అని చెప్పింది జ్యోతి.

'అదేమిటమ్మా...పెళ్ళిస్తైన సంబంధం చేద్దామని...' జానికమ్మగారు అంటుండగానే మధ్యలో ఆపి...'వద్దు...నేను ఆ సంబంధం చేసుకోను...నేను ఆనందరావు బావను నేను కోడానికి నిశ్చయించుకున్నాను. నిన్న మధ్యాహ్నం ఆయన మనింటికి వచ్చారు...ఆ ఏర్పాట్లు చెయ్యండి...వద్దు పొలం అమ్మ డానికి వీల్లేదు...' అంటూ తల్లి చేతులో వున్న కాగితాలు లాగి చించేసింది జ్యోతి.

'ఈ కాలపు పిల్లలు అన్నీ చోద్యమే!...' అంటున్న జానకమ్మగారికి జవాబు చెప్ప కుండా గబ గబా పైకి వెళ్ళి తన పెట్టెలో భద్రంగా దాచుకున్న వుత్తరాల కట్ట తీసి అగ్గిపుల్ల వెలిగించింది జ్యోతి. ఆ మంట వైపు రెప్ప వాల్చకుండా ఓ నిముషం చూసి వెళ్ళి పక్కమీద వాలిపొయ్యింది.

(ఇంకావుంది)



దిన దినానికీ...

# రెక్సోనావల్ల

## మీ చర్మ సౌందర్యం అతి మనోహరంగా పెంపొందుతుంది

రెక్సోనా వాడుటవల్ల మీ చర్మ సౌందర్యం ప్రతిరోజూ క్రొత్త సొంపుగా వుంటుంది. రెక్సోనాలో వే సౌందర్యకారియైన ప్రత్యేక నూనెల మిశ్రమం 'కేడిల్' వున్నది. రెక్సోనాయే మీ కెంతో ప్రీతియైన మనోల్లాసకరమగు పరిమళమును మీ శరీరంపై నిలిపియుంచుతుంది. రోజూ రెక్సోనా వాడండి.




'కేడిల్'తో కూడిన రెక్సోనా మీ చర్మానికి గుణకారి

హిందూస్థాన్ లీవర్ ఉత్పత్తి



"ప్రాణమిత్రులు" చిత్రంలో నాగేశ్వరరావు, జగ్గయ్య.

చిత్రసమీక్ష:

నరికొత్తకథ, సంగీతసుధ, పేరని

# ప్రాణమిత్రులు

మొన్న ఒక సభలో ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు మన ప్రాచీన సంస్కృతిని నిలబెట్టగల చిత్రాలు మనకు కావాలి అన్నారు. వెనువెంటనే అలాంటి చిత్రం విడుదల అవడం ముదావహం!

'ప్రాణమిత్రులు' అనే మాట వినిపించగానే కృష్ణార్జునుల స్నేహం, రామాంజనేయ సహవాసం వెంటనే గుర్తొస్తుంది. మరి ఆధునిక ప్రాణమిత్రులు, ప్రాణమిత్రులుగా దేశవ్యాప్తమైన కీర్తి గడించుకోవాలంటే మనాది భారతంలో దొరుకుతుందని ఈ చిత్రం చూసి చూడగానే అనిపిస్తుంది. నటుడు నాగేశ్వరరావు విశ్వరూపం దగ్గర్నుంచి 'బాబు చిన్నారి యుద్ధం' వరకు చిత్రీకరణ ఒక విశిష్ట ఆకర్షణ. కథాంశంలో కొత్తదనముంది. ఆద్యంతమూ ఉత్కంఠ ఉంది.

'చిన్నా మీద ఈగవాలితే సహించలేడు బాబు' అంచేత రాయి తీసుకుని ఈగను కొడతాడు...ప్రాణమిత్రులు... దుఃఖాంతం. మంచికీ మానవత్వానికీ కఠినపరీక్ష! కథలో పాత్రలకు పరీక్ష, పాత్రలో నటులకూ పరీక్ష చివరకు విజయవంతమైన ముగింపు అందర్నీ అలరిస్తుంది.

చిన్నాగా నాగేశ్వరరావు నటన గణనీయంగా వుంది. బాబుగా జగ్గయ్య ప్రతిభావంతంగా నటించారు. వీరిద్దరూ ఈ చిత్రానికి జీవం. ప్రాణమిత్రుల్లో ఒకరికి ఓన్నమహాలు కూడా రావంటే ప్రేక్షకులు నమ్మరు. నమ్మించే నటన చేస్తారు నాగేశ్వరరావు. అతి క్లిష్టమైన పాత్రను మనాయాసంగా చేసేశారు జగ్గయ్య. దివానుగా గుమ్మడి నటన ప్రశంసార్హం. అగ్రతారలు సావిత్రి, కాంచన, రేలంగి, అల్లురామలింగయ్య, శాంతకుమారి, గిరిజ, చదలవాడ, రావి కొండలరావు మొదలైనవారు నటించిన ఈ చిత్రంలో గీతాంజలి సుకన్య అతిథులుగా కనిపిస్తారు.

చక్కని కథ, మాటలు, ముళ్ళపూడి వెంకటరమణ రాశారు. ఆత్రేయ, దాశరథి, సి. నారాయణరెడ్డిగార్ల పాటలకు కె. వి. మహదేవన్ పసందయిన సంగీతం కూర్చారు. ఛాయాగ్రహణం: పి. యస్. సెల్వరాజ్. నిర్మాత వి. వెంకటేశ్వర్లు కోసం పి. పుల్లయ్య దర్శకత్వం వహించి సర్వాంగ సుందరంగా చిత్రించారు. సపరివారంగా చూసి ఆనందించతగ్గ చిత్రం ప్రాణమిత్రులు. శ్రీ ఫిలింస్ రిలీజ్,

—పీతరాజా

## అవీ - ఇవీ...
## యన్. టి. ఆర్. రక్షణనిధి - అభినందన సభ

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారి సమక్షంలో, వారి సతీమణి శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి 'యన్. టి. ఆర్. రక్షణనిధి' కార్యక్రమ విజయాన్ని పురస్కరించుకుని విడుదలచేసిన సావనీర్‌ను ఆవిష్కరించారు. విజయా గార్డెన్సులో ఏర్పాటుచేసిన ఈ సభకు ప్రఖ్యాత తమిళ నటుడు, శాసనసభ్యుడు అయిన శ్రీ యస్. వి. రామచంద్రన్ అధ్యక్షత వహించారు.

శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు ప్రార్థనతో కార్యక్రమం ఆరంభమైంది. శ్రీ బి. నాగిరెడ్డి ముఖ్యమంత్రి దంపతులకు స్వాగతం పల్కారు. శ్రీ సి. యస్. రావు 'యన్. టి. ఆర్. రక్షణనిధి' కార్యక్రమాన్ని వివరించారు. శ్రీ డి. రామానాయుడు నిధి వివరాల్ని తెలిపారు. శ్రీ యన్. టి. రామారావు రక్షణ నిధి సేకరణకు తోడ్పడ్డవారికి కృతజ్ఞతలు చెప్పారు. ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి మాట్లాడుతూ చలనచిత్ర రంగంలో మన ప్రాచీన సంస్కృతిని నిలబెట్టగల చిత్రాల నిర్మాణం అవసరమన్నారు. యన్. టి. ఆర్. రక్షణనిధి కార్యక్రమంతో సుమారు పదిలక్షల రూపాయిల నిధిని సేకరించిన బృందాన్ని అభినందించారు. శ్రీ యమ్. జి. రామచంద్రన్ అధ్యక్షోపన్యాసం తర్వాత శ్రీ డి. వి. యస్. రాజా వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది. అనంతరం విందు జరిగింది.

—పీతరాజా



"ఉమ్మడికుటుంబం" యన్. టి. రామారావు, ఎల్. విజయలక్ష్మి.

# వాణిశ్రీ



శ్రీ ప్రొడక్షన్స్‌వారి కొత్త చిత్రంలో వాణిశ్రీ నాయికగా నటిస్తున్నదనేసరికి, పరిశ్రమలో రకరకాల వ్యాఖ్యలు వినిపించినవి 'కైకొద్దుల్తు దైవం'లో సావిత్రి వేసినవేషం వాణిశ్రీ ఏం చేస్తుంది? ఆమెకీ యీమెకీ పోలికేమిటి? అయినా వాణిశ్రీయే గాని ఆ వేషానికి మరెవరూ దొరకలేదా? అంటూ అనేకమంది విపరీత వ్యాఖ్యానాలు చేశారు ఈ మాటలు ఆ చిత్రనిర్మాతలలో ఒకరైన ధూండీగారిదాకా వెళ్ళక పోలేదు. విని ఆయన పట్టించుకోలేదు వాణిశ్రీ చేస్తుందనే నమ్మకం ధూండీగారిలో ఉంది ఎవరు యీ విషయంగురించి చెప్పబోయినా ఆయన లెక్క చెయ్యలేదు చిరు

స్నేహితులతో కబుర్లుచెప్పుకోటం సరదా





...కి కథ 'ఎలారాయాలంటారూ'

నవ్వు సమాధానంగా యిచ్చి వాణిశ్రీని ఆ వేషానికి వినియోగించుకున్నారు ఈ విధంగా ప్రోత్సహించి ఎంతోమందిని పైకి తీసుకువచ్చిన ధీశాలి ఆయన 'వాణిశ్రీ ఎందుకు చేయలేదు?' అని శ్రీ ధూండీలా ఆలోచించగలిగినవారు బహు కొద్దిమంది. అయిదారేళ్ళుగా ఆమె నటిగా కృషి చేస్తుంటే యీనాటికి తెలుగు చిత్రాల్లో నాయిక అయింది

'నేను కథానాయిక వేషాలు ఎందుకు చెయ్యలేనూ?' అంటూ నన్నొకసారి అడిగింది వాణిశ్రీ 'ఎవరన్నారు?' అన్నాను 'ఎవరూ అనటంలేదు అనుకుంటున్నట్లున్నారు లేకపోతే మరి నాకెవరూ ఎందుకు యివ్వటం లేదు?' అంది అమాయకంగా. ఎంతోబాధ కలిగింది తపన, చెయ్యాలన్న ఉత్సాహం, కృషి ఉన్న వాణిశ్రీకి కామెడి, వాంప్ తదితర వేషాలే యిస్తున్నారు గాని కథానాయిక వేషాలు ఎందుకు యివ్వడం లేదన్న విషయం నాకూ బోధపడలేదు. ఏమయితేనేం వాణిశ్రీ యీనాటికయినా హీరోయిన్ కావటం ముదావహం ఇప్పటికయినా ఆమె ప్రతిభ గుర్తించబడటం గమనార్హం.

వాణిశ్రీ పుట్టినతేదీ 1946 ఆగష్టు 3. జన్మస్థలం నెల్లూరు, ... చిన్నప్పట్నుంచీ

సినిమాలంటే మక్కువ. శ్రీమతి సావిత్రి నటించిన చిత్రాలు ఎక్కువగా చూసేది. అలా చెయ్యాలనీ అంతటి నటికావాలనీ అనుకుంటూ వుండేది. 1959 లో మద్రాసు వచ్చింది. లోకానికి పనికివచ్చే చదువు లేకపోయినా తనకు ఉపయోగపడే చదువు నేర్చుకున్నది. మద్రాసు వచ్చాక శ్రీమతి టి. ఆర్. నాగలతివద్ద భరత నాట్యం అభ్యసించటం ప్రారంభించింది. అలా కొంతకాలం గడచింది. ‘ఈ భరత నాట్యం ఎన్నిరోజులు నేర్చుకున్నాయింతే! సినిమాల్లోకి ప్రయత్నించు’ అంటూ పోరోజా సలహా యిచ్చిందావిడ వాణిశ్రీకి. ఆవిడ చెప్పిన సలహా అయితే బాగానే వున్నది కాని, సినిమాల్లో నటించే అవకాశం కల్పించే వారెవరు? తనకి ఎవరూ తెలీదు. ఏవరూ తనని ఎరగరు.

ఒక రోజు దర్శక నిర్మాత శ్రీ బి. వి. సుబ్బారావును కలిసి తన కొక వేషం యివ్వమని అడిగింది. ఆయన ‘భీష్మ’ చిత్రం నిర్మిస్తున్నారపుడు. అందులో ఒక చిన్న పాత్ర యిచ్చారు. ఆ చిత్రం చూసిన కొందరు ‘నువ్వు పైకిరావు. సినిమాల్లోకి పనికిరావు’ అని చెప్పి నిరుత్సాహ పరిచారు. అప్పటినుంచీ వాణిశ్రీకి పట్టుదల మరీ ఎక్కువ అయింది. ఎలాగైనా సాధించాలను కున్నది. అనేక నాటక ప్రదర్శనలు యిచ్చింది. తర్వాత కన్నడ దర్శకుడు శ్రీ హున్సూరి కృష్ణమూర్తిగారు చూసి, కన్నడ డైలాగ్స్ చెప్పించారు. బాగా చెప్పింది వాణిశ్రీ. ఆయనకు సంతృప్తి కలిగి అప్పుడు ఆయన నిర్మిస్తున్న ‘వీర సంకల్పం’ లో కథానాయకి వేషం యిచ్చి ప్రోత్సహించారు. అటు పిమ్మట ‘బంగారు తిమ్మరాజు’ లోను, ‘నవగ్రహ పూజామహి’ లోను అవకాశాలు వచ్చినవి.

ఇలా అప్పటినుంచి యిప్పటిదాకా వాణిశ్రీ సుమారు 30 చిత్రాల్లో నటించింది. క్రమంగా షూటింగులకు హాజరవుతూ వచ్చిన అవకాశాలను చక్కగా వినియోగించు కుని అనతికాలంలోనే ఆమె మంచి నటిగా పేరు తెచ్చుకున్నది.

శ్రీ ప్రొడక్షన్స్ వారి కొత్త చిత్రం, గౌరీ ప్రొడక్షన్స్, వీనస్ పద్మినీ కంబైన్స్, ఎర్రగులాబీ, ఏ. వి. యం. వారి రెండు చిత్రాలు, నిండు మనసులు, కాంభోజరాజు కథ, వీరపూజ, సత్యమేజయం, ప్రేమతో ప్రవాహాదం, భయంకర పిశాచి; టైగర్ ప్రొడక్షన్స్ మూడవ చిత్రం, తెలుగు చిత్రాలలోను; ఆరు తమిళ చిత్రాలలోను, ఒక కన్నడ చిత్రంలోను ప్రస్తుతం వాణిశ్రీ నటిస్తున్నది.

వాణిశ్రీ స్టూడియోలో వున్నా, సెట్లో వున్నా, ఇంట్లో వున్నా— ఎక్కడ వున్నా సరదాగా వుంటుంది. ఆమె వున్నచోట ఎంతో సందడిగా వుంటుంది. తను నవ్వుతూ, నలుగుర్నీ నవ్విస్తూ, ఎప్పుడూ ఉత్సాహంగా కనిపిస్తుంది. తీరిక వేళల్లో రేడియోలో వచ్చే పాటల్ని వినటం, పుస్తకాలు చదువు కోవటం స్నేహితులతో పిచ్చాపాటీ మాట్లాడుకోవటం వాణిశ్రీకి సరదాలు. ఒకోసారి కథల గురించి ఆలోచిస్తుంది. కథలంటే—కథలు ఎల్లా రాయాలీ అని? ‘ఇంతకీ కథ ఎలా రాయాలంటారూ?’ అని అడుగుతూ వుంటుంది నేను కనిపించి నప్పుడల్లా.

నటనలోను, నాట్యంలోను చక్కటి ప్రతిభను సంతరించుకున్న కుమారి వాణిశ్రీకి— ప్లవంగనామ సంవత్సరం ఉజ్వల భవిష్యత్తును ప్రసాదిస్తున్నది. ఆశీర్వదిస్తున్నది.

—మోహన్ కుమార్

ఫొటోలు: ప్రభాకర్ ●



‘నేను కథానాయకి వేషాలు ఎందుకు వెయ్యలేనూ’



'వసంతసేన'లో పద్మిని, గిరిజ



వి. ఆర్. ఫిలింస్‌వారి మ్యూజికల్ మినర్వలో రాజశ్రీ

# చిత్రలహరి

'ఓ...బ్యూటిఫుల్! చిత్రా, రేడియోగ్రామ్ చాలా బావుంది. వెరిబ్యూటిఫుల్. ఎక్కడ కొన్నారు?' అడిగాడు రమేష్! చిత్ర నవ్వి 'ఏమో నాకు తెలీదు. మమ్మీ నడుగు!' అన్నది మమ్మీ పద్మావతి అక్కడేవున్నది. ఆమె చిరునవ్వుతో రమేష్‌వేపు చూస్తూ 'ఓ అదా...అది లండన్‌నుంచి తెప్పించాం. ఇంపోర్టెడ్. చాలా కాస్ట్లీ. మన దేశంలో యింతమంచి వస్తువులు ఎక్కడ దొరకుతాయి?' చెప్పింది. 'ఎగ్జాక్ట్లీ' అంటూ తనూ నవ్వాడు రమేష్. 'కట్' అన్నారు. దర్శకుడు దాదా మిరాసి చిత్ర జ్యోతిలక్ష్మి, రమేష్ హరనాథ్ పద్మావతి భానుమతి.

* * *

ఇంతలో ఆ సెట్‌లోకి రచయిత డి. వి. నరసరాజు, విజయా పూర్ణచంద్రరావుగార్లు వచ్చారు. అంతదూరంనుంచే పద్మశ్రీ భానుమతి వారిని చూసి 'నమస్కారమండీ! మేం లండన్‌లో వున్నాం' అన్నారు. దగ్గరకి వస్తూ 'ఆఁ!' అన్నారు నరసరాజు, ఆమె అన్నదేమిటో బోధపడిక. 'మేమిప్పుడు లండన్‌లో వున్నాం. డోన్ట్ డిస్టర్బ్' అన్నారు భానుమతి మళ్లీ చిలిపిగా...తర్వాత షాట్‌కి ఏర్పాట్లు జరుగుతున్నపుడు అంతా కలిసి అదే సెట్లో వున్న హాల్లోకి చేరారు. అక్కడున్న సోఫాల్లో కూచుని కబుర్లాయణం ప్రారంభించారు. అంతా అంటే పద్మశ్రీ భానుమతి, హరనాథ్, కృష్ణకుమారి, జ్యోతిలక్ష్మి.

* * *

'భార్యాభర్త ఇద్దరూ ఒకేవృత్తిలో వున్నవాళ్లయితే సుఖం. ఏగొడవా వుండదు. భర్త డాక్టరయి, భార్య కాకపోతే— సినిమాకీ షికారుకీ తీసుకెళ్లలేదని గొడవ పెడుతుంది. అందుకే మా అబ్బాయి (భరణి)కి డాక్టరీ చదువుతున్న అమ్మాయి నిచ్చి పెళ్లిచేస్తున్నాం!' అన్నారు భానుమతి. 'పెళ్లి ఎప్పుడు?' అడిగాను. 'ఈ నెల 12 వ తిరుచామార్‌లో ఉదయం తెం. 6—45 ని. లకు 14 వ

"మద్రాసులో రిసెప్షన్ యిస్తున్నాం" అన్నారాయన సమాధానంగా. 'అయితే అమ్మాయికూడా డాక్టరే నన్నమాట!' అడిగింది కృష్ణ కుమారి. 'ఇక్కడే వాడితో పాటు మెడిసన్ మూడో సంవత్సరం చదువుతోంది. ఒకే చోట...ఇద్దరూ విడివిడిగా వెళ్ళికూచోవడం ఎందుకూ? పెళ్ళి చేసేస్తే కలిసే వెళ్ళికూచుంటారు' అంటూ నవ్వారు, భానుమతి. 'భరణి వయసు ఎంతిప్పుడు?' అడిగాడు హరి. 'వాడికి ఇరవై రెండు. ఆ అమ్మాయికి పంధొమ్మిది. మన కృష్ణ కుమారి హైట్ ఉంటుంది.' 'ఇద్దర్నీకలిపి ఫారిన్ పంపించెయ్యండి' అన్నాడు హరి. 'అవును. అదే మంచిది. ఒక్కణ్ణీ పంపితే రెండుగా వస్తాడు. ఇద్దర్నీపంపితే మూడుగా వస్తారు. బిడ్డతో' అంటూ జోక్‌చేశారు, భానుమతి.

* * *

# చిత్రలహరి

అందర్నీ షాట్‌లోకి పిలిచారు దాదా మిరాసి. వెళ్ళేముందు 'లవ్‌మారేజిట!' అన్నది కృష్ణ కుమారి నవ్వుతూ. ఆ తర్వాత రెండు సన్నివేశాలను చిత్రీకరించారు. బ్రేక్ టైము అయింది. పద్మశ్రీ భానుమతి యింటికి వెళ్ళే సన్నాహంలో వున్నారు. 'కోడలిపేరు ఏమిటి?' అని అడిగాము. ఆవిడ వెనక్కితిరిగి నవ్వి 'విజయలక్ష్మి...' చెప్పాను. మళ్ళా రెండింటికల్లా రావాలి యిక్కడికి, షూటింగ్ వుంది' అంటూ కారెక్కి వెళ్ళిపోయారు.

* * *

ఈ సంభాషణ అంతా యీ నెల 3 వ తేదీన వాహినీ స్టూడియోస్‌వారు నిర్మిస్తున్న సాంఘిక చిత్రం సెట్లో జరిగింది. ఇంకా పేరుపెట్టని యీ చిత్రంలో పైన పేర్కొన్న వారితోపాటు యన్. టి. రామారావు, యస్. వి. రంగారావు, శోభన్ బాబు, అల్లు రామలింగయ్య, సీతారాం, రాధాకుమారి ముఖ్య భూమికలు పోషిస్తున్నారు. మొదట్లో యిందులో హరనాథ్ సరసన భారతి నటిస్తుందని అనుకున్నారు. కాని అనివార్య కారణాలవలన యిపుడు ఆ వేషానికి జ్యోతి లక్ష్మిని వినియోగించుకుని షూటింగ్ జరుపుతున్నారు. రచన: డి. వి. నరసరాజు, సంగీతం: ఘంటసాల, కెమెరా: జాగీర్దార్, అసోసియేట్ డైరెక్టర్ చెర్వు ఆంజనేయశాస్త్రి, దర్శకుడు: దాదామిరాసి, కూర్పు: నారాయణన్, నిర్మాత: ఎస్. వాసు మీనన్. విజయా పిక్చర్స్‌వారు యీ చిత్రానికి పంపిణీదారులు. ఈ చిత్రంలోగల మొత్తం ఆరు పాటల్లోను యింతవరకు మూడు పాటలు రికార్డు చేశారు. వాటిని డా. సి. నారాయణరెడ్డి రాశారు. రెండు సుశీల, ఒకటి ఘంటసాల పాడారు.



'శాంతకుని హత్య'లో సావిత్రి

* * *

శ్రీ ప్రొడక్షన్ వారు నిర్మిస్తున్న సాంఘికచిత్రం నిర్మాణం పూర్తి కావస్తున్నది. మూడు పాటలు చిత్రీకరణతప్ప, మిగిలిన పని అంతా పూర్తి అయింది. కృష్ణ, వాణిశ్రీ, చంద్రమోహన్, నాగభూషణం, రావికొండలరావు, ఎం. వి. చలపతిరావు మున్నగువారు ముఖ్యపాత్రలు ధరిస్తున్నారు.



'పట్టుకుంటే పదివేలు'లో భారతి, బేబీ మల్లిక



'చిక్కడు దొరకడు'లో ఎన్. టి. రామారావు, విజయలలిత

# చిత్రలహరి

సంభాషణలు: భమిడిపాటి రాధాకృష్ణ, సంగీతం: టి. చలపతిరావు, కళ: యస్. కృష్ణారావు, కెమెరా: యస్. వెంకటరత్నం, కూర్పు: యస్. యస్. ప్రకాశం, దర్శకుడు: వి. రామచంద్రరావు, బి. ఏ. (ఆనర్స్), నిర్మాతలు: సుందర్‌లాల్‌నహతా, డూండీ.

* * *

'చిట్టీ చిట్టీ యిటురావే, చేయిపట్టుకోనీవే—బలేబలే బావయ్యా, హడావిడి ఆపవయ్య' కొసరాజు రాసిన యీ హాస్యగీతాన్ని మేనెల 2, 3 తేదీలలో యస్. వి. యస్. వారి 'నిండుమనసులు' చిత్రానికిగాను, రాజ్‌బాబు, వాణిశ్రీలపైన చిత్రీకరించారు. వీనస్ స్టూడియోలో టి. వి. రాజు సంగీత నిర్వహణలో ఎల్. ఆర్. ఈశ్వరి, పిఠాపురం నాగేశ్వరరావు పాడారు. త్వరిత గతిని నిర్మించబడుతున్న యీ చిత్రంలో దేవిక, యన్. టి. రామారావు నాయకీనాయకులుగా నటిస్తున్నారు. దర్శకుడు: యస్. డి. లాల్, నిర్మాత: ఎం. జగన్నాధరావు ఆంధ్రలో యీ చిత్రానికి జోతిపిక్చర్స్‌వారు పంపిణీదారులు.

* * *

సుజాతా పిక్చర్స్‌వారి అపరాధ పరిశోధక చిత్రం 'హంతకుని హత్య' విడుదలకు ముస్తాబులు సంతరించుకొంటున్నది. సావిత్రి, కె. ఆర్. విజయ, యస్. వి. రంగారావు, చంద్రబాబు, మనోహర్ మున్నగువారు నటించారు. మాటలు: మహారధి, సంగీతం: విశ్వనాధం, సామర్తి, కెమెరా: లక్ష్మణ్ గోరే, దర్శకుడు: చంద్రబాబు, నిర్మాత: పి. బాబ్జి. ఈస్టిండియా ఫిలిం కంపెనీ వారిద్వారా త్వరలో విడుదల కాబోతున్నది.

* * *

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారు కొత్త చిత్ర నిర్మాణానికి ఉపక్రమిస్తున్నారు. సరికొత్త తరహాకు చెందిన యీ చిత్రకథకు భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు రాస్తున్నారు. నాగేశ్వరరావు, జయలలిత ప్రధాన భూమికలు నిర్వహిస్తారు. సంగీతం: చలపతిరావు, దర్శకుడు: టి. రామారావు, నిర్మాత: ఏ. వి. సుబ్బారావు. జూన్‌నుంచి సెట్స్‌కు వెళ్లే యీ చిత్రం హైదరాబాద్‌లోని శ్రీ సారధీ స్టూడియోలో నిర్మించబడుతుంది.

—మోహన్‌కుమార్

# పుస్తకాలు

## అహింసామూర్తులు

నాటిక. స్త్రీపాత్ర లేని 'ప్రచార' నాటిక అని పుస్తక సారాంశాన్ని బ్రాకెట్లలో వుంచారు! ప్రదర్శనకూ ప్రచారానికి బాగా ఉపయుక్తంగా ఉంటుంది. రచయిత కారెపు అప్పలస్వామి. 52 పేజీల ఈ ఏకాంక నాటిక వెల రూపాయి. ప్రచురణ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ.

## యుగ ప్రభాత్

కేరళ నుంచి వెలువడుతున్న 'యుగప్రభాత్' సచిత్ర హిందీ పక్ష పత్రిక ఉగాది ప్రత్యేక సంచిక మా కార్యాలయం చేరింది. ఇందులో బుచ్చిబాబు, కాళోజీ నారాయణరావ్, మల్లంపల్లి సోమశేఖర శర్మ, గుర్రం జాషువా, అడవి రామకృష్ణారావు, దేవరకొండ బాలగంగాధర తిలక్, నేదునూరి గంగాధరం మొదలైన వారి రచనలున్నాయి. శ్రీ ఎన్. వి. కృష్ణవారియర్ సంపాదకత్వంతో కాలికట్ నుంచి వెలువడుతున్నది. విడిప్రతి 50 పైసలు, సంవత్సర చందా ఆరు రూపాయలు.

—సితరాజు

## జగదేకసుందరి క్లియోపాత్రా

(చారిత్రక నవల) రచన: ధనికొండ హనుమంతరావు. ప్రచురణ: శ్రీ పబ్లికేషన్స్, 12, స్టీఫెన్స్ రోడ్, మద్రాసు—24. ప్రతులకు: మహర్షి అండ్ కో. నంద్యాల. పేజీలు 688, వెల: రు. 12—00.

గ్రీకు లకుమారి హెలెన్, ఈజిప్టు లక్ష్మి క్లియోపాత్రా సౌందర్యానికి ప్రతీకలు. క్షమ కడగంటి చూపుల చేత, మహావీరులనూ, రారాజులనూ పాదాక్రాంతులను చేసి కొనడమే గాక, దేశభవిష్యత్తునే నిర్దేశించిన అసమాన ప్రజ్ఞాధురీణలు. హోమర్, షేక్స్పియర్ వంటి విశ్వకవుల వాణిలో రూపు రేఖలు దిద్దుకొని, సర్వకాలాలకు ఉజ్జ్వలంతులై నిల్చినవారు. రంగస్థలం నాటి, చలన చిత్రాలలో, పాటలలో దర్శకులకు రచయితలకు ధనమునకు కారణ భూతములైనవారు. వారిలో ఒకరైన క్లియోపాత్రాను గురించి శ్రమించి, తెనుగులో బృహద్గ్రంథాన్ని వెల్వరించిన ధనికొండవారి కృషి ఎక్కువగా ప్రశంసనీయం.

వారు క్లియోపాత్రా కథను చారిత్రక నవలగా మలచడం లోనే వారి దృష్టి పాఠకులకు అవగతమవుతున్నది. పైగా క్లియోపాత్రను జగదేకసుందరిగా చూపి ఆ సౌందర్యాల, ఈజిప్టు చరిత్రలో ఎన్నో కొత్త లధ్యాయాలను, యుద్ధాలను, క్రొత్త సంప్రదాయాల, గ్రీకు—రోమన్ నాగరికతా విధానానికి కారణమైందో నిరూపించడం వారి ధ్యేయంగా వ్యక్తమవుతున్నది. కాని ఈ ధ్యేయమూన్ని రెండవ ముద్రణంలో నైనా హనుమంతరావు గారు నెరవేర్చుకోలేక పోవడం విచారకరం.

క్లియోపాత్రా, టాలమీ భార్యగా సీజర్ ప్రేయసిగా, ఆంటోనీ వివాహమాడిన సుందరిగా, కనిపిస్తుందే తప్ప ప్రపంచ ఖ్యాతి గనిన సౌందర్య ఖనిగా సాక్షాత్కరించదు. షేక్స్పియరు నాటకంలో కనిపించే క్లియోపాత్రకు ధనికొండ వారి నవలా శిరోమణికి పోలికే లేదు. పైగా ఆమె రాజ్యత్వానికి, ఆమెవాడిన భాష దోహదకరంగా లేకపోవడమే కాకుండా జుగుప్సాకరంగా గూడా వుంది. ఉదాహరణకు 8వ పేజీ, 14వ పంక్తిలో తన సోదరిని గూర్చి 'మొద్దుముండ' అన్న ప్రయోగమూ, 19వ పేజీలో 20వ పంక్తిలో రచయిత ఆమె మస్తిష్కాన్ని 'బుల్లిబుర్ర' అని పరిచయము చేయడము ఆంటోనీతో పొందు లేకుండానే 207 వ పేజీలో సీజర్‌తో గడిపిన ప్రణయంలో కూడా ఆమె సీజర్‌కు మారుగా ఆంటోనీనే జ్ఞాపకం చేసుకుంటూ, వూహించుకుంటూ ఆనందిస్తూ స్పందించడమూ, 'స్వతంగా నాకు ధైర్య సాహసాలు లేక పోవచ్చు. స్వయంగా రణరంగంలో సైన్యాలను నడప లేక పోవచ్చు. మహావీరుని వలె నేను ప్రవర్తించలేక పోవచ్చు.' అని పలికించడమూ, ఆమె ఉదాత్త ప్రకృతికి దోహదం చేయదు. మనుషుల తోడి ఆమె సంబంధాలు ఈజిప్టు జీవన విధానం పైన ఎటువంటి ప్రభావం చూపినదీ రేఖామాత్రంగా నైనా చూపించలేదు.

చారిత్రక నవలకు ముఖ్యంగా కావలసిన లక్షణాలు హేతుబద్ధమైన రచన, చారిత్రక సత్యాలను విస్మరించి స్వకపోల కల్పనలతో మసిపూసి మారేడు కాయ చేయక పోవడము. ఈ మధ్య కాలంలో తెన్నేటి సూరి మినహాయించి, విదేశీ చరిత్రకు న్యాయాన్ని కల్గజేస్తూ తెనుగున నవలా రచన సాగించిన వారు లేరనే చెప్పవచ్చు. ధనికొండవారు రోమను వాతావరణాన్ని గానీ ఈజిప్టు వాతావరణాన్ని గానీ నవలలో చూపించలేదు. విదేశీ పేర్లతో వున్న ఒక నవలను ఒక కాముకి కథను చదువుతున్నట్లు వుంటుంది. స్వైరిణిగా, అధికార మదాంధగా క్లియోపాత్రా పాఠకులను ఆకర్షించడం రచయిత పొరపాటు.

పోనీ భాషా విషయంలో నైనా ధనికొండవారు తగినంత శ్రద్ధ తీసుకున్నట్లు కన్పడదు. 5వ పేజీలో ఆయా చేత "స్త్రీ జాతిలో సిలాంటి అప్సరస పుడుతుందని ఏకవిగాడూ ఊహించి వుండడు" అని పలికించడం, 37వ పేజీలో 'గద్ద సతాకాలు', 63 వ పేజీలో క్లియోపాత్రా చేత తన భర్త అయిన తమ్ముని గూర్చి "ఆ వెధవను చంపేసి ఉండేదాన్ని!" అనిపించడం 50వ పేజీలో "ఆ చచ్చిపోయినా ఇప్పుడి సమాధిపైన ఉమ్మి వేయని వారు లేరంటే" అన్న ప్రయోగం 51వ పేజీలో "ప్రష్టవనో", 508 వ పేజీలో "చావటు, వాజమ్మ" వంటి మాటలు, 648వ పేజీలో "ఆలోచనలు అలించిన గడిలో పడడం", విచ్చిపోతున్న పిల్లలను 640 వ పేజీలో "సుభద్ర"లో వున్నారనడం అనౌచిత్యానికీ అశ్రద్ధకూ ఉదాహరణాలు. ఈరకంగా పుస్తకం నిండా వెతికిన కంటికి దోషాలు బహుళంగా కన్పించినా సామాన్య పాఠకుల్ని మాత్రం ఒకచిత్రమైన భ్రాంతికి లోను చేస్తుంది నవల. చదివించుకు పోయే శైలీ, సంఘటనాత్మకమైన ప్రేమ గాథా ఇందుకు కారణాలు.

—శ్రీరామచంద్రమూర్తి.

## కవితాపుష్పకం

రచన: శ్రీ దాశరథి. డెమ్మీ 8 + 112 పుటలు. సచిత్రం. వెల: సాదాప్రతి రూ. 3 మేలుప్రతి: రూ 5. ప్రకాశకులు: ఎం. శేషాచలం అండ్ కో, మదరాసు, మచిలీపట్నం, సికింద్రాబాదు.

ఇందులో సుప్రసిద్ధ నవ్యకవి శ్రీ దాశరథి రచించిన నలభై కవితలు సచిత్రంగా ఆకర్షకంగా ముద్రించబడినవి. సహజంగా కవిత్వ శక్తి అలవడిన శ్రీ దాశరథి పేరు, తెలంగాణంలో అరాచకత్వం ఏర్పడి రజాకార్లు వూళ్ళమీద తిరగబడి, అమాయకులైన ప్రజలను చిత్రవధ చేస్తున్న కాలంలో చాలా ప్రసిద్ధికి వచ్చింది. ఈయన తన కవిత్వాన్ని ఆయుధంగాస్వీకరించి నిజాం ప్రభుత్వాన్నియెదిరించి, ప్రజలలో ప్రబోధాన్ని కలిగించి లక్షలాది జనుల హృదయాలను చూరగొన్నారు. ఈ విషయాన్నే ప్రకాశకులు "ప్రణయ కవిత నుంచి ప్రళయ కవితకు దిగి, సమర సాహిత్యాన్ని స్థాపించి నిలువునా నిరంకుశమూర్తియైన నిజాం నవాబుకు సింహస్వప్నమైన తెలంగాణా ప్రజలను నిద్రనుండి లేపి"నట్లు తెలియ జేస్తున్నారు.

శ్రీ దాశరథి కవిత ధారావాహికంగా ప్రవహించి స్వేచ్ఛా విహారం చేస్తుంది. "ఈయన కవితా కన్యక ఒకప్పుడు అగ్ని చేలాలను ధరించి నృత్యం చేస్తుంది. మరొకప్పుడు పీడిత ప్రజానీకానికి 'మైక్'గా పని చేస్తుంది. ఇంకొకప్పుడు ప్రకృతి సౌందర్యాన్ని ప్రతిబింబిస్తుంది, వేరొకప్పుడు ప్రణయ పరిమళాలను గుబాళిస్తుంది."

ఈ కవితల్లో, ప్రణయ మార్గానికీ, ప్రళయ మార్గానికీ సంబంధించిన చక్కని వర్ణన లున్నవి. రవీంద్రుని వంటి మహాకవులయు, మహాత్ముని వంటి మహానాయకులయు, మహాత్యాగులైన అబ్దుల్ హమీదుల వంటి మిత్రులయు ప్రశస్తిని పాడే మధుర రచనలూ ఉన్నవి. ప్రకృతి శోభను వర్ణించే వివిధఘట్టాలూ ఉన్నవి. రచనలన్నీ పఠితలను ఆనందంలో ముంచి ఎత్తివేసి ఆకాశమార్గానికి తీసుకుని పోతాయి. కవితా పుష్పకం అనే పేరు— ఆలోచించి పెట్టినదో— లేక యథాలపంగా తోచినదో కాని అన్నివిధాలా యీ కవితా సంపుటికి తగి ఉన్నది. ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా ఉంది.

నవ్యతతో తొణికిసలాడుతూ ఉన్నా— అనేక విషయాలను కళ్ళకు కట్టినట్లు దాశరథిగారి రచనతో పోటీ పడుతూ ఉన్నా— శ్రీ ఆరుద్ర చేసిన

# పుస్తకాలు

"వరి వరి వరిచయాలు" నవ్యాంధ్ర కవిత్వ చరిత్రలో ఒక ముఖ్యమైన అధ్యాయమనే చెప్పాలి. శ్రీ దాశరథి వ్యక్తిలోనూ, రచనలలోనూ వుండే లోతుపాతులను తెలుసుకోడానికి యిది ఎంతో ఉపయోగకరం.

ఉదాత్త హృదయులూ, ఉత్తమ పురుషులూ, విద్వత్కవి విమర్శకులూ, విద్యావేత్తలూ అయిన శ్రీ దేవుల పల్లి— రామానుజరావుగారికి ఈ కవితా సంపుటి అంకితం కావడం 'మణినా వలయు' మనే నానుడికి తగిన ఉదాహరణ. ఇట్టి చక్కని గ్రంథాన్ని ఆంధ్రలోకానికి అర్పిస్తున్న శ్రీ శేషాచలం కంపెనీ వారిని ఈ సందర్భంలో విస్మరించడం ఎంత మాత్రమూ తగదు. విస్మరించ లేము కూడాను.

—అంగీరస

# మెదడుకి మేత

### జవాబులు

(క) అతడు 15 రూపాయలు, నేను 45 రూ.లు పెట్టుకోవడం న్యాయం. ఏమంటే మొత్తం రానూపోనూ ప్రయాణం లో సగం దూరం (ఢిల్లీ నుంచి మధురకీ, మధుర నుంచి ఢిల్లీకి) కారులో నేనొక్కడినే ఉన్నాను. కనుక, ఈ సగం దూరంకీ నేను 30రూ.లు ఎలాగూ ఇచ్చుకోవాలి. మిగిలిన సగం దూరమూ మేమిద్దరం కలిసి ప్రయాణం చేశాం. కనుక 30రూ. లను మేమిద్దరమూ చెరిసగం ఇచ్చుకోవాలి. కనుక, అతడు 15రూ. లు, నేను 45రూ. లు ఇవ్వడమే న్యాయం.

(చ) పది ఎత్తులలో ఈ క్రింది విధంగా మార్చవచ్చు.



| | |
|---|---|
| 2 నుంచి 1 | 4 నుంచి 7 |
| 5 నుంచి 2 | 1 నుంచి 4 |
| 3 నుంచి 5 | 3 నుంచి 1 |
| 6 నుంచి 3 | 6 నుంచి 3 |
| 7 నుంచి 6 | 7 నుంచి 6 |







(గ) ఏడు సిగరెట్లను ఏ విధంగా అమర్చవచ్చునో ఇక్కడి బొమ్మలో చూపించాను. సిగరెట్లు పొడవు వ్యాసానికి $(\frac{7}{2} \times \sqrt{3})$ రెట్లు కన్న (లేక 6.062 రెట్లు కన్న) అధికంగా ఉన్నప్పుడే ఈ విధంగా అమర్చడం సాధ్యం. మామూలుగా సిగరెట్లు పొడవు వ్యాసం కన్న 8,9 రెట్లు ఎక్కువగా ఉంటుంది. కనుక ఈ విధంగా అమర్చడం సాధ్యమే.


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.